# వనిత

స్త్రీ జన మాస పత్రిక

## అక్టోబర్ ('84) సంచికలో....

ఎవరెస్ట్ విజేత
**బచేంద్రిపాల్‌తో గోష్ఠి**
వర్ణ చిత్రంతో

పాండ్స్ – వనిత
**సౌందర్య ప్రహేళిక**
ఫలితాలతో మరో పోటీ

వాసిరెడ్డి సీతాదేవి
**వాస్తవ గాథలు లో**
'మరో దేవి' కథ

మాగ్నటో తెరాపిస్ట్
**డా॥ శ్రీనివాసన్‌తో గోష్ఠి**
నిర్వహణ : జలంధర

ఇంకా

మిమ్మల్ని అలరిస్తున్న అరెకపూడి కౌసల్యాదేవి – 'స్వయం సిద్ధ' - నశేషనవల, పెదపూడి రాజ్యలక్ష్మీదేవి – గాయత్రి, ఎస్. భానుప్రియ – స్వయంవరం, జి. ఉషావితల్ - ముగ్గురమ్మాయిల కథ, జె. వరలక్ష్మి – యూరోప్ పర్యటన విశేషాలు, పతితల శీర్షికలు - నా పదహారేళ్ళ వయసులో', అవీ మా సమస్యలు .... ఇంకా మీరు మెచ్చే, మీకు నచ్చే అనేక శీర్షికలతో వెలువడుతున్నది!



## నవంబర్ సంచికే

## దీపావళి ప్రత్యేక సంచిక

ఎక్కువ పేజీలతో
ప్రత్యేక సంచికలలో ప్రత్యేక తరహాలో
**ప్రత్యేక శీర్షికలతో వెలువడుతున్నది!**

వెల నాలుగు రూపాయలు మాత్రమే!

**నేడే మీ ఏజెంటు వద్ద మీ ప్రతి రిజర్వు చేసుకోండి!!**

చందా వివరాలకు : విజయా బుక్ హౌస్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు-600 026

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["చదువు"] కు ఆధారం, "వసుంధర" రచన. మోసాలకు పాల్పడడం, నయవంచనా, నిజాయితీ లేక పోవడంలాటి దుర్లక్షణాలు పామరజనంలోనే కాక, పండితులలోనూ వుండే అవకాశంవున్నది. ఉన్నతేడా ఏమంటే, పామరుడి మోసం బయటపెట్టడం చాలా తేలిక; పండితుడి మోసం కనుక్కొగలగటం కొంత కష్టసాధ్యం. "ప్రజ్ఞా ప్రదర్శనం" అన్న కథ దీన్ని నిరూపిస్తుంది.

## అమరవాణి

శునకో వృషభో న స్యాత్, మశకశ్చ మహాగజః,
శశకస్తు న శార్దూలః, లుబ్ధో దాతా కథం భవేత్.

[కుక్క ఎన్నడూ వృషభం కాలేదు. దోమ ఏనుగు కాలేదు. చెవులపిల్లి పెద్దపులి కాజాలదు. అలాగే, లోభి ఎన్నడూ దాత కాలేదు.]

సంపుటి 75 అక్టోబర్ '84 సంచిక 4

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



## చందమామ కబుర్లు



### న్యాయమూర్తి ఆత్మవిమర్శ!

న్యూ మెక్సికోలోని శాంటాఫీకోర్టు ప్రధాన న్యాయమూర్తి, ఒక రోజు న్యాయస్థానానికి అయిదు నిమిషాలు ఆలస్యంగా వచ్చారు. అలా ఆలస్యంగా వచ్చినందుకు ఆయన తనకుతానే యాభై డాలర్లు జరిమానా విధించుకున్నారు.

### జలకన్యలు ఉన్నాయా?



న్యూగినీ సముద్రతీరవాసులు — సముద్రంలో జలకన్యలు, జలపురుషులు ఉన్నట్టు నమ్ముతున్నారు. పైభాగం మానవా కృతిలోనూ, కిందిభాగం చేపరూపంలోనూ వుండే ఈ వింత ప్రాణులను వాళ్ళు 'రి' అని పిలుస్తారు. వాటిని స్వయంగా చూశామని చెప్పే చాలామందితో మాట్లాడిన తర్వాత — వర్జీనియా విశ్వవిద్యాలయానికి చెందిన రాయ్ వాగ్నర్ అనే మానవశాస్త్రవేత్త కూడా వాటిని నమ్మడానికి ఆరంభించాడు.



### సౌరశక్తితో సైకిల్‌రిక్షా

సౌరశక్తిని సంపదగా భావించి, దాన్ని ఏ ఏ విధంగా ఉపయోగించుకోగలం అన్న విషయంమీద మన భారత విజ్ఞానవేత్తలు ఎన్నో పరిశోధనలు, ప్రయోగాలు చేస్తున్నారు. ఆ పరిశోధనల ఫలితంగా, సౌరశక్తితో నడిచే సైకిల్‌రిక్షను రూపొందించడంలో మన విజ్ఞాన వేత్తలు విజయం సాధించారు.

## మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్లా పొడవైన ద్వారమార్గం గల దేవాలయం ఏదో మీకు తెలుసా?
2. మనదేశంలో రాతితో చేయబడిన పెద్ద నందివిగ్రహం ఎక్కడున్నది?
3. నిర్మాణ సమయంలో ఒక బాలుడి దుర్మరణానికి సంబంధం వున్న, భారతదేశంలోని సుప్రసిద్ధ ఆలయం ఏదో మీకు తెలుసా?
4. అరేబియా సముద్రరాణిగా పేరుగాంచిన రేవుపట్టణం ఏదో మీకు తెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)



# ప్రజ్ఞాప్రదర్శనం

ప్లవంగరాజ్యాన్ని పాలించే లలితసేనుడు కవిపోషకుడుగా పేరు పొందినవాడు. పంచరత్నాలని ప్రసిద్ధికెక్కిన అయిదుగురు కవులు, ఆయన కొలువులో వుండేవారు. ఆ పంచరత్నకవుల మీద తనకున్న గౌరవం కొద్దీ లలితసేనుడు, తన దర్శనార్థం వచ్చే కవులంతా, ముందుగా వాళ్ళను దర్శించి మెప్పించి తన వద్దకు రావాలంటూ నియమమొకటి పెట్టాడు.

ఒకనాడు లలితసేనుడు ఉద్యానంలో తిరుగుతూ, వెంట వున్న మంత్రి ముకుళవర్మతో ఏదో మాట్లాడుతున్నాడు. ఆ సమయంలో, పంచరత్నకవులు పంపగా వచ్చామంటూ ఇద్దరు కవులు అక్కడికి వచ్చి, రాజును పొగడుతూ ఆశువుగా కొన్ని పద్యాలు చదివారు.

లలితసేనుడు అసహనంగా ఆ కవుల వంక చూస్తూ, పక్కనే వున్న సేవకుడితో, వెంటనే ఆ కవులిద్దరికీ ఏమైనా బహుమతు లిప్పించి పంపవలసిందిగా ఆజ్ఞాపించాడు.

సేవకుడు కవులిద్దర్నీ వెంటబెట్టుకు వెళ్ళాక, ఆయన మంత్రితో, "ఈ వచ్చిన వాళ్ళ కవిత్వం విన్నాక, మన రాజ్యంలో కవిత్వం చెప్పేవాళ్ళ స్థాయి ఎంత దిగజారిపోయిందో బాగా అర్థమవుతున్నది." అన్నాడు.

రాజు మాటలకు మంత్రి ముకుళవర్మ, అవును కాదు అనకుండా తల వూపి వూరుకున్నాడు.

లలితసేనుడు కొంచెం సేపాగి, "ఘంటం పట్టగల ప్రతివాడూ, తాను కవి నన్న దురహంకారంలో వున్నట్టున్నది! ఆస్థానం స్థాయికి తగినట్టు వున్నవారినే, నా దగ్గరకు పంపమని పంచరత్నకవులకు స్పష్టంగా చెప్పాను కూడా." అన్నాడు.

కమలిని



మంత్రి ముకుళవర్మ చిన్నగా నవ్వి, "ప్లవంగరాజ్యంలో ప్రతిభగల కవులకు ఎలాంటి కొదువాలేదు. కాని, వారంతా మీ దర్శనానికి రాలేకపోతున్నారు. అంతే." అన్నాడు.

లలితసేనుడు కోపంగా మంత్రి వంక చురచుర చూస్తూ, "మీరు పంచరత్నకవుల నిజాయితీని అనుమానిస్తున్నట్టున్నది! అయినా గొప్ప గొప్ప కవులందర్నీ వారు, నా దర్శనానికి రానివ్వకుండా అడ్డుకుంటు న్నారనా, మీ అభిప్రాయం?" అని ప్రశ్నించాడు.

మంత్రి జవాబివ్వకుండా, మౌనంగా వూరుకున్నాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, విశాలుడనే కవి రాజును దర్శించి, తను రాసిన కావ్యాల్లోంచి కొన్ని అంశాలను ఆయనకు వినిపించాడు.

రాజు ఆ కవి ప్రతిభకు ముగ్ధుడై, "నిజానికి మీరు మహాకవుల కోవకు చెందినవారు. మీ పరిచయభాగ్యం కలగ డానికి యింతకాలం పట్టడం, నా దుర దృష్టం," అని, పక్కనే వున్న మంత్రితో, "చూశారా! మన, పంచరత్నకవులు అసూయతో, ప్రజ్ఞావంతులైన కవులకు రాజదర్శనం లభించకుండా చేస్తున్నారని, మీరనుమానించినట్టున్నది. అదే నిజమ

"ఈ సంగతి రాజ్యంలో అందరికీ తెలిసిందే, మహారాజా! అయినా, పంచ రత్నకవులు యిలాంటివారిని తమ వద్దకు ఎందుకు పంపుతున్నట్టో మరి!" అన్నాడు మంత్రి.

మంత్రి మాటలవెనక ఏదో గూఢార్థం వున్నట్టు తోచింది, లలితసేనుడికి. ఆయన కొంచెం చిరాకుపడుతూ, "రాజసత్కారం అందకుండా, కవులకు తాము అడ్డుపడు తున్నామనే అపవాదు వస్తుందన్న భయం వారికుండి వుంటుంది. ఇది వారి నిష్పక్ష పాతబుద్ధికి చక్కటి నిదర్శనం అయినా, నాకు మాత్రం కోపకారణం అవుతున్నది," అన్నాడు.

యితే, ఈ విశాలుడి వంటి గొప్ప కవిని యింత సులువుగా, నా దగ్గిరకు రానిచ్చే వారా!'' అన్నాడు.

మంత్రి, విశాలుడి కేసి చూశాడు. విశాలుడు రాజుతో, ''మహారాజా, నేను ప్రతిభావంతుడనైన కవినన్న సంగతి, పంచరత్నకవులకు తెలియకుండా, వారిని పక్కదారి పట్టించగలిగానన్న మాట. ఈ విషయంలో ఎంతగానో సాయపడిన మంత్రి గారికి, నేనెంతో ఋణపడి వున్నాను,'' అన్నాడు.

లలితసేనుడు ఆశ్చర్యంగా మంత్రి కేసి చూశాడు. మంత్రి వినయంగా, ''ప్రభూ, కవుల ప్రతిభను గుర్తించి తగు విధంగా సత్కరించవలసినవారు, మీరు. అలాంటప్పుడు తమ ప్రజ్ఞనంతా పంచరత్న కవుల ముందు ప్రదర్శించవలసిన అవసరం ఎందుకన్న శంక, మన రాజ్యం లోని చాలామంది గొప్ప కవులకు కలిగి నట్టులేదు. వారు ముందుగా పంచరత్న కవులను దర్శించడం, వారి ప్రతిభ తమ కన్న గొప్పదని గ్రహించినప్పుడు, ఆ పంచరత్న కవులు వారికి తమ దర్శన భాగ్యం కలగకుండా చేయడం జరుగు తున్నది,'' అన్నాడు.

''అలాగా!'' అంటూ రాజు లలిత సేనుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

మంత్రి ముకుళవర్మ, రాజుకు విశాలుణ్ణి చూపుతూ, ''మీరు మహాకవిగా గుర్తించిన, వీరి విషయంలోనే జరిగింది



వినండి. ఆ మధ్య వికీర్ణుడు అనే పండితుడు, ఈయనను, తన శిష్యుడంటూ నాకు పరిచయం చేశాడు. మహారాజుగారి ఆస్థానంలో శాశ్వతంగా వుండతగ్గ మహాకవి అని నాకు చెప్పాడు. పంచరత్నకవుల ప్రమేయం లేకుండా రాజదర్శనం కలిగించమని నన్ను కోరాడు. తమ ఆజ్ఞ కారణంగా, అది సాధ్యపడదని నేను ఆ పండితుడికి చెప్ప వల సి వచ్చింది,'' అన్నాడు.

''అంటే, మీరు పంచరత్నకవులను కలుసుకోకుండానే, సరాసరి నా దగ్గిరకు వచ్చారన్నమాట. అవునా ?'' అని రాజు విశాలుణ్ణి అడిగాడు.

''వారి దర్శనం చేసుకున్నాను, మహారాజా! కాని, వారి ముందు నా కవితా ప్రజ్ఞను మాత్రం ప్రదర్శించలేదు. అలా చేస్తే, తమ దర్శనం లభ్యం కాదని, యితర కవుల అనుభవం ద్వారా లోగడే నేను తెలుసుకున్నాను. ఆ కారణంగా, అతి సామాన్యుడైన కవిగా ప్రవర్తించాను. వెంటనే తమ దర్శనానికి వారి నుంచి అను మ తి ల భించింది,'' అన్నాడు విశాలుడు.

రాజు కోపంగా, ''కవులుగా పంచరత్న కవుల ప్రతిభను, నేను కాదనను. కాని, వాళ్ళు అసూయాపరులలా వున్నారు. రాజ్యంలో తమను మించిన కవులు మరి లేరని, వాళ్ళు నన్ను నమ్మించదలిచారన్న మాట !'' అన్నాడు.

''ప్రభూ, అదే ఆ కవులు చేస్తున్న పని. లోగడ ఒకసారి మనం ఉద్యానంలో వుండగా, ఏమాత్రం ప్రతిభ లేని యిద్దరు కవులను వాళ్ళు తమ వద్దకు పంపారు, గుర్తున్నది కదా ?'' అన్నాడు మంత్రి ముకుళవర్మ.

లలితసేనుడికి పంచరత్నకవుల నిజ స్వరూపం అర్థమైపోయింది. ఆయన విశాలుణ్ణి తన ఆస్థానకవిగా నియమించి, మధ్య ఇతరుల ప్రమేయం లేకుండా, రాజ్యంలోని కవులు తన దర్శనం చేసుకునేందుకు తగిన ఏర్పాట్లు చేశాడు.






## 18

[పింగళుడు అవంతీనగరం చేరేసరికి, తల్లి ద్వారా అక్కడ తన అన్నల దుస్థితి తెలిసింది. వెంటనే భల్లూకకేతుణ్ణి పంపి, రాజుగారి ధనాగారంలోని డబ్బు, మహత్తు గల నంచీతో పాటు, అన్నలను కూడా తన యింటికి తెప్పించాడు. తరవాత అతడి ఆజ్ఞ కాగానే, భల్లూక కేతుడు తన అనుచరులతో ఒక అపూర్వభవనం కట్టేందుకు పూనుకున్నాడు. తరవాత—]

భల్లూకకేతుడు తన అనుచరులతో చీకటి పడేసరికల్లా అవంతీనగరం తిరిగివచ్చాడు. అతడి నాయకత్వం కింద, నదీతీరంలో భవన నిర్మాణం ప్రారంభించబడింది. వేల సంఖ్యలో వున్న పిశాచశిల్పులూ, కూలీలూ కలిసి, పునాదులు తవ్వి, రాళ్ళు చెక్కి ఒక అపూర్వభవనం కట్టసాగారు.

నదీతీరంలో చెలరేగిన యీ కోలాహలం, అవంతీనగర కావలివాళ్ళు విని, అక్కడేమి జరుగుతున్నదో చూడబోయారు. ఇలా వచ్చినవారిని చాలా మందిని, భల్లూకకేతుడి అనుచరులు పట్టుకుని, భవన నిర్మాణపు పనిలో ఉపయోగించుకున్నారు. కత్తులూ, కఠార్లూ తీసుకువచ్చి ఎదురుతిరిగిన రాజభటులను మెత్తగా తన్ని తగిలేశారు.

సూర్యోదయం అయ్యేసరికల్లా భవనం తయారయింది. పింగళుడు, తల్లినీ, అన్న



లనూ వెంటబెట్టుకుపోయి అందులో ప్రవేశించాడు. బాలసూర్యుని లేత కిరణ కాంతిలో ఆ భవనం బంగారు నీరు అద్దినట్టు తళతళలాడిపోయింది. పింగళుడు భల్లూకకేతుడి అనుచరులలో ఓ యాభై మందిని మాత్రం తనకు కాపలావాళ్ళుగా వుంచుకుని తతిమ్మావారిని భల్లూకపర్వతాలకు పంపేశాడు. భల్లూకకేతుడు ప్రహరీగోడకు వున్న ఇనపచువ్వల తలుపులను బార్లా తెరిచి, వాటి పక్కగా ఒక పెద్ద రాతి కుర్చీ మీద కావలివాడిలా కూర్చున్నాడు.

ఆసరికే అవంతీనగర రాజప్రాసాదంలో కలకలం బయలుదేరింది. రాత్రి భల్లూకకేతుడి అనుచరులు కడుతున్న వింత భవనం చూడబోయి, వాళ్ళవల్ల చావు దెబ్బలు తినివచ్చిన రక్షకభట నాయకుడొకడు మంత్రి దగ్గిరకు వెళ్ళి మొరబెట్టుకున్నాడు. ఆ భవనం, అక్కడ పని చేస్తున్న శిల్పులూ, కూలీలూ పిశాచాలని విన్నప్పుడు మంత్రికి మొదట యిది నమ్మదగినదిలా తోచలేదు.

"ఏమోయ్, యిది నమ్మశక్యంగా లేదు. నీవు తాగిన మత్తులో ఏవేవో పిచ్చి కలలు కనివుంటావు. ఇక యింటికి పోయి విశ్రాంతి తీసుకో. రాజుగారికి తెలిస్తే నీకు కారాగారం తప్పదు," అన్నాడు మంత్రి.

"లేదు, మహామంత్రీ! ఇంకా మన భటులు కొందరు వాళ్ళకు ఖైదీలుగా వున్నారు. ఆ పిశాచాలచేత చావుదెబ్బలు తిని పారిపోయి వచ్చింది నేనొక్కణ్ణే కాదు. ఇంతెందుకు, మీరు కోట బురుజు ఎక్కి చూడండి, నదీతీరాన వున్న ఆ భవనం కనబడుతుంది!" అన్నాడు రక్షక భట నాయకుడు.

మంత్రి బురుజు ఎక్కి చూశాడు. ఎదురుగా నదీతీరాన సూర్యకాంతిలో మిలమిలలాడుతున్న వింతభవనం అతడి కంటబడింది. అతడి ఆశ్చర్యానికి అంతు లేదు. "ఏమిటీ అద్భుతం!" అనుకుంటూ



అతడు బురుజు దిగి వచ్చేంతలో, కోశాగారాధిపతి పెద్దగా శోకాలు పెడుతూ, "మహామంత్రీ! కొంప లంటుకున్నై. కోశాగారంలో చిల్లిగవ్వ లేకుండా దొంగి లించబడింది!" అన్నాడు.

"కోశాగారం కొల్లబోయిందా? కావలి వాళ్ళేమయారు? వాళ్ళను వెంటనే యిక్కడికి పిలిపించు!" అన్నాడు మంత్రి వణికిపోతూ.

"కావలివాళ్ళ లోపం ఏమీ లేదు, మహామంత్రీ! కోశాగారం తలుపులు వేసి నవి వేసినట్టే వున్నవి. వాటి బీగాలు చెక్కు చెదరలేదు. అంతా మాయ!" అన్నాడు, కోశాగారాధిపతి ఆకాశం కేసి చూస్తూ.

"అంతా మాయ! అలాగా?" అంటూ మంత్రి కోశాగారాధిపతి కేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూస్తూ, "ఈ మాయకు నీవనుభవించబోయేది ఉరిశిక్ష, తెలుసా? రాజుగారి దగ్గరకు పద!" అంటూ హుంకరించాడు.

మంత్రీ, కోశాగారాధిపతీ రాజుగారి గదిని సమీపించబోయేంతలో, కారా గారాధిపతి బొబ్బలుపెడుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, "మహామంత్రీ! మహా విపత్తు జరిగిపోయింది! ఆ జీవదత్తుడూ, లక్షదత్తుడూ మాయమయారు!" అన్నాడు.

ఈ మాటలతో మంత్రికి మతిపోయి నట్టయింది. అతడు కారాగారాధిపతి కేసి గుడ్లురుముతూ, "ఆ జీవదత్తుడూ, లక్ష దత్తుడూ దేవతలా ఏం? ఎలా మాయ మయారు?" అన్నాడు గద్దిస్తూ.

"వాళ్ళుండే కొట్లో ఒక గొయ్యి మాత్రం వున్నది. అంత పెద్ద గొయ్యి మానవమాత్రు లెవరూ చేయలేరు. ఏ దేవతలో, రాక్షసులో చేసి వుండాలి!" అన్నాడు కారా గారాధిపతి.

మంత్రి ఆలోచనలో పడ్డాడు. నదీ తీరాన ఒక్క రాత్రిలో నిర్మింపబడిన భవనం, రక్షకభటనాయకుడు చెప్పే మాటలూ, రాజభవనంలో జరిగిన వింతలూ



చూస్తూంటే, యిదంతా మానవమాత్రుల పని కాదని అతడికి అర్థమైంది. ఖైదు కొట్లలో నుంచి విడిపింపబడిన జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ మంత్రవేత్త అయిన పింగళు డనే ఒక తమ్ముడు వున్నాడని మంత్రి లోగడ విని వున్నాడు. "ఈ జరిగినదంతా రాజుగారికి విన్నవించటమే మంచిది. మంత్రవేత్త అయిన పింగళుడు యీ నగరానికి తిరిగి వచ్చి వుండాలి!" అన్నాడు మంత్రి.

కాని, రాజుగారి గదిని సమీపించేసరికి, అక్కడా కల్లోలంగానే వున్నది. "నిజం చెప్పండి! మిమ్మల్నందర్నీ కొరత వేయించుతాను. నా అద్భుతాల సంచీ ఎక్కడ?" అంటున్నాడు రాజుగారు. ఆయన కెదురుగా, రాజుగారి వంటగదిలో పనిచేసే నౌకర్లంతా చేతులు కట్టుకుని నిలబడి వున్నారు.

మంత్రి రావటం చూస్తూనే, రాజుగారు అతడికేసి తిరిగి, "మంత్రీ, వీళ్ళనందరినీ కట్టకట్టి ఏనుగుల చేత తొక్కించు. దుర్మార్గులు! నా మహత్తు గల సంచీని దొంగిలించారు!" అన్నాడు ఉద్రేకంగా.

"మహారాజా! యింకా చాలా ఘోరాలు జరిగిపోయినై." అంటూ మంత్రి అన్ని సంగతులూ రాజుగారికి నివేదించాడు. అంతా విని రాజు మండిపోతూ, "వెంటనే ప్రాసాద రక్షకుణ్ణి పిలిచి, యాభైమంది భటులను వెంటబెట్టుకుపోయి, ఆ భవనంలో వున్నవారందరినీ పెడరెక్కలు విరిచికట్టి యిక్కడికి లాక్కు రమ్మను!" అని ఆజ్ఞాపించాడు.

"మహారాజా, సావధానంగా ఆలోచించండి!" అంటూ మంత్రి యింకా ఏమో చెప్పబోయేంతలో, రాజు కస్సుమని లేచి, "నువ్వు ఆ జాలరివాడికి రాజ్యం కట్టబెట్టి, మంత్రిత్వం వెలిగిద్దామని చూస్తూన్నావా ఏం?" అన్నాడు తీవ్రంగా.

మంత్రి మారు మాటాడలేకపోయాడు. అప్పుడే అక్కడికి వచ్చిన రాజప్రాసాద రక్షకుడు రాజుతో, "మహారాజా! పింగ



ళుణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకురమ్మని సెలవా ?'' అని అడిగాడు.

''వాణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకు వచ్చినా, గాడిదకు కట్టి యీడ్చుకు వచ్చినా నా కొకటే! నాకు కావలసింది మహత్తు గల సంచీ, ధనాగారం నుంచి వాడు దోచుకుపోయిన డబ్బూ. తెలిసిందా ? యిక పో,'' అన్నాడు రాజు కోపంగా.

ప్రాసాదరక్షకుడు సాయుధులైన యాభైమంది భటులను తీసుకుని పింగళుడి భవనాన్ని సమీపించాడు. ప్రహరీ ద్వారం దగ్గిర పెద్ద రాతి కుర్చీలో కూర్చుని, నీరెండలో జోగుతూన్న భల్లూకకేతుణ్ణి చూస్తూనే భటులు అదిరిపడి, ''అయ్యో! వీడెవడో రాక్షసుడిలావున్నాడు. ఆ ఏనుగు చెవులు చూడండి! అడవిపంది కోరల్లా వున్నవాడి దంతాలు చిత్తగించండి!'' అన్నారు వెనకడుగు వేస్తూ.

ప్రాసాదరక్షకుడుపకపకమంటూనవ్వి, ''ఓరి అమాయకుల్లారా, భయపడకండి! వీడెవడో మనను భయపెట్టేందుకు, పగటివేషగాడిలా అవన్నీ తగిలించుకున్నాడు!'' అంటూ గుర్రాన్ని అదిలించి, భల్లూకకేతుణ్ణి సమీపించి, తన చేతగల యీటెతో అతడి భుజాన్ని పొడుస్తూ, ''అరే పొగరుబోతూ, కళ్ళు తెరు! రాజప్రాసాద రక్షకుడు ఏతెంచాడు!'' అన్నాడు కోపంగా.

భల్లూకకేతుడు కళ్ళు తెరుస్తూనే తన భుజానికి ఆనివున్న యీటెను ఒక చేత్తో గుంజుకుని, దానిని తిరగవేసి, ప్రాసాద రక్షకుణ్ణి డొక్కలో రెండు పోట్లు పొడిచి, కుయ్యోమంటున్న అతగాడి రెండు కాళ్ళూ పట్టుకుని గిరగిరా తిప్పి, దూరంగా నదిలో విసరివేశాడు.

ఈ దృశ్యం చూస్తూనే తతిమ్మా రాజభటులు, ''అయ్యో, బాబో!'' అని అరుస్తూ అక్కడినించి పిక్కబలంకొందికీ పారిపోసాగారు. భల్లూకకేతుడు వారి కేసి ఓ తృటికాలం చూసి చిరునవ్వు నవ్వి తిరిగి



తన రాతికుర్చీలో కూర్చుని తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు.

పారిపోయిన భటులు హాహాకారాలు చేస్తూ, రాజుగారి దగ్గిరకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పారు. అది విన్న రాజుకు ఆగ్రహం ముంచుకువచ్చింది. "ఓరి చవటల్లారా! ఒక్క అడివిజాతి మనిషిని పట్టుకురావటం మీవల్ల కాలేదన్నమాట, ఛీ!" అన్నాడు ఆయన. వెంటనే మంత్రి ముందుకు వచ్చి, "మహారాజా! తొందర పడకండి! వాడు అడివిజాతి మనిషో లేక రాక్షసుడో మనకు తెలియదు. పింగళుడు మంత్రవేత్త అని మీకు తెలియంది కాదు గదా?" అన్నాడు వినయంగా.

"వాడెంత మంత్రవేత్త అయితేమాత్రం ఆ జాలరి, అవంతీ నగరరాజునే ధిక్క రిస్తాడా? వాడి తల నరికించి కోట కొమ్మకు కట్టిస్తాను!" అని, "సేనానీ, సేనానీ!" అని చప్పట్లు చరిచాడు రాజు.

"మహారాజా!" అంటూ సేనానాయ కుడు ముందుకు వచ్చాడు. పింగళుడు కట్టిన భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికిన వారినందరినీ వెంటనే బంధించి తేవలసిందిగా రాజు అతడికి ఆజ్ఞ యిచ్చాడు.

సేనానాయకుడి ఉత్సాహానికి అంతు లేదు. యీ మధ్య కొన్ని సంవత్సరాలుగా యుద్ధాలు లేకపోవడంతో అతడికి మతి పోయినట్టుగా వున్నది. యీ దెబ్బతో నదీ తీరంలో వున్న భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికినవారినందరినీ మనసారా చిత్రహింస చేయవచ్చుననుకున్నాడు. "ఈ పింగళుడనేవాడికి చిన్న సైన్యం వుంటే ఎంత బాగుండును! బాహాబాహి, ముష్టాముష్టి భీకర భయంకర ఘోర సంగ్రామం చేద్దునే!" అనుకున్నాడతడు.

రెండు వందలమంది అశ్వికులూ, మూడువందలమంది కాలిభటులూ వెంట రాగా సేనానాయకుడు ఎంతో పటాటో పంతో బయలుదేరి పింగళుడి భవనాన్ని సమీపించాడు. భల్లూకకేతుడు నిద్ర

పోతున్నట్టు నటిస్తూనే, ఒక కన్ను సగం తెరిచి సేనానాయకుడి రాకను గమనిస్తు న్నాడు. సేనానాయకుడు ప్రహరీగోడ ద్వారాన్ని సమీపించి చేతనున్న యీటెను భల్లూకకేతుడి కేసి గురిపెట్టి, "ఏయ్, అడివిమనిషీ! మీ యజమాని ఎక్కడ? లే, లేచి నిలబడు!" అన్నాడు ఆజ్ఞా పిస్తున్నట్టు.

భల్లూకకేతుడు అప్పుడే మెలుకువ వచ్చినవాడిలా ఒళ్ళు విరుచుకుంటూ లేచి నిలబడి సేనానాయకుడి కేసి దృష్టి సారించి, "ఎవడురా పిలిచిన మానవాధ ముడు, నువ్వేనా?" అన్నాడు కోపంగా.

ఆ ప్రశ్నతో సేనానాయకుడు నిలువెల్లా భగ్గుమన్నాడు. అతడు యీటెను భల్లూక కేతుడి గుండెలకు బారుచేసి, గుర్రాన్ని ముందుకు దూకించాడు. భల్లూకకేతుడు తీరా యీటె మొన గుండెల్ని తాకబోయే సమయానికి పక్కకు అడుగువేసి, గుర్రం మీద సేనానాయకుణ్ణి రెండు చేతులతోనూ వొడిసి పట్టుకుని, రాతికుర్చీలో పడవేసి పైన కూర్చుంటూ, చప్పట్లు చరిచాడు.

వెంటనే బిలబిలమంటూ అతడి అను చరులు వివిధ రకాల రాతిఆయుధాలతో అక్కడికి పరిగెత్తుకువచ్చారు. వారికి పారిపోజూస్తున్న రాజభటులను చూపిస్తూ, "ఈ పొగరుబోతులను దూదికింద ఏకి




తాళ్ళు పేనండి!" అన్నాడు భల్లూక కేతుడు.

భల్లూకకేతుడి అనుచరులు రాజుగారి అశ్వికుల మీదా, కాలిభటుల మీదా పడి రాతి ఆయుధాలతో వాళ్ళను గొడ్లను బాదినట్టు బాదసాగారు. ఈ దృశ్యాన్ని చూసి భవనంలోని రెండో అంతస్తులో వున్న పింగళుడూ, తల్లీ, అన్నలూ పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.

బతికి బయటపడిన కొద్దిమంది రాజ భటులు కోటలోకి పరిగెత్తి, గోడుగోడు మంటూ జరిగినదంతా రాజుగారికి చెప్పారు. ఆ సరికి రాజుగారికి పింగ ళుడు మామూలు జాలరి కాదని అర్థమై

పోయింది. ఆయన కోపాన్ని తొక్కి పట్టు కుంటూ లేచి, తన మంత్రితో, "మంత్రీ! ఇది చాలా అవమానకరం అయిన సంగతి. చావో బతుకో నేనే స్వయంగా సైన్యాన్ని నడిపి ఆ పింగళుడితో పోరాడుతాను. నేను ఒకవేళ యుద్ధంలో మరణించటమే జరిగితే, నా ఒక్కగానొక్క కుమార్తె వకుళను నువ్వే అన్నివిధాలా కాపాడి, ఆమెకు తగిన వరుణ్ణి చూసి వివాహం జరిపించాలి," అన్నాడు.

మంత్రి ఓ క్షణకాలం ఆలోచించి, "మహారాజా! తమరు ఆగ్రహించక నే చెప్పబోయేదాన్ని శాంతంగా వినాలని కోరుతున్నాను," అన్నాడు.

"ఏమిటదీ?" అన్నాడు రాజు.

"పింగళుడు యువకుడు, అవివాహితుడు. అతన్ని ఎరిగివున్న వారి ద్వారా నాకు తెలిసినదేమిటంటే, అందచందాలలో ఏ రాజకుమారుడూ అతడికి సరి రాడని. ఐశ్వర్యంలో, శౌర్యసాహసాల్లో కూడా అతడికి అతడే సాటి. రాజకుమార్తెతో అతడికి వివాహం జరిపించటం ద్వారా మీకూ రాజ్యానికూ్కడా పెద్ద ఉపద్రవం తప్పుతుంది!" అన్నాడు మంత్రి.

రాజు కొంచెంసేపు ఆలోచించి, "ఇది నాకు సమ్మతమే, మంత్రీ!" అన్నాడు సంతోషంగా.

మంత్రి సర్వలాంఛనాలతో వెళ్ళి పింగళుడినీ, తల్లినీ కలుసుకుని రాజుగారి కోర్కె గురించి చెప్పాడు. రాజకుమార్తె సౌందర్యాన్ని గురించి లోగడే వినివున్న పింగళుడు వివాహానికి అంగీకరించాడు.

తరవాత కొద్ది రోజులకే రాజకుమార్తె వకుళకూ, పింగళుడికీ వైభవంగా వివాహం జరిగింది. మహామాంత్రికుడైన పద్మపాదుడు వివాహానికి వచ్చి వధూవరులను ఆశీర్వదించాడు. కొంతకాలానికి రాజు మరణించగా, పింగళుడే అవంతీ నగరానికి రాజై, చాలా సంవత్సరాలు ప్రజలకు యిష్టుడుగా రాజ్యపాలన చేశాడు. —(అయిపోయింది)






# చదువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఈ భయంకర శ్మశానంలో నువ్వు దేన్ని సాధించదలచి, ఇన్ని శ్రమలకు ఓర్చుకుంటున్నావో, నాకు అర్థం కావడం లేదు. నీలాగే చాలామంది వ్యక్తుల్లో పట్టుదలా, కష్టాలకు తట్టుకుని నిలబడగలశక్తీ వుంటుంది. కాని, వాళ్ళు దాన్ని సక్రమంగా ఉపయోగించుకోలేక అంతులేని ఈతిబాధలకు గురవుతారు. నీవూ అలాంటివారిలో ఒకడివేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా ఒక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



గంగరాజు అనే స్థితిమంతుడైన రైతుకు, సుశాంతుడు ఒక్కగానొక్క కొడుకు. బాగా ఆస్తిపరుడు కావడం వల్ల, ఆయన కొడుక్కు బాగా చదువు చెప్పించి, అన్ని విద్యల్లోనూ ఆరితేరినవాణ్ణి చేయాలనుకున్నాడు. అయితే, సుశాంతుడికి అయిదు సంవత్సరాల వయసప్పుడు, గంగరాజుకు ఏదో తెలియని జబ్బు చేసి, మనిషి బాగా నీరసించిపోయాడు. ఆనాటి నుంచీ ఆయన మళ్ళీ కోలుకోలేదు. అందువల్ల, సుశాంతుణ్ణి తన దగ్గిరే వుంచుకుని, ఇంటి వ్యవహారాలూ, వ్యవసాయం మొదలైనవి, చిన్నప్పటి నుంచీ నేర్పాడు. పదిహేనేళ్ళ వయసు వచ్చేసరికి, సుశాంతుడే మొత్తం అన్ని పనులూ చూసుకో సాగాడు.

సుశాంతుడికి విద్యపట్ల ఆసక్తి ఎక్కువ. ఆ ఊళ్లో చదువు చెప్పే గురువు, బాగా చదువుకున్నవాడు కాదు. శిష్యులకు అక్షరజ్ఞానం మాత్రం కలిగించ గలడు. అయితే, సుశాంతుడు మంచి గ్రహణశక్తి కలవాడు. ఆ గురువు దగ్గిరే వాడు, మిగతా శిష్యులను మించి నేర్చుకున్నాడు. ఆ తరవాత ఆ ఊళ్ళోనే శకారు డనే కవి వుంటే, ఆయన వద్దకు వెళ్ళి కావ్యపఠనం చేసేవాడు. అంతకు మించి సుశాంతుడికి చదువుకునే అవకాశం లేకపోయింది.

సుశాంతుడు ఎంతో జిజ్ఞాసకలవాడు. ప్రకృతిలోని ప్రతి విశేషాన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, దానికి కారణాలు అన్వేషిస్తూండేవాడు. ఈ పరిశీలనాశక్తి వల్ల, వ్యవసాయంలో ఎన్నో కొత్త పద్ధతులు ప్రవేశపెట్టేవాడు. ఊళ్ళో అందరూ అతడి తెలివితేటల్ని మెచ్చుకునేవారు. ఎవరికే సమస్య వచ్చినా, చిన్నవాడని సందేహించకుండా, వాడి దగ్గిరకు వచ్చేవారు. వాడు తృప్తికరంగా సమాధానాలు యిచ్చేవాడు.

తండ్రి జబ్బు గురించి సుశాంతుడు ఎప్పుడూ ఆలోచిస్తూండేవాడు. ఊళ్ళో వైద్యుణ్ణి కలుసుకుని, ఏయే వ్యాధి, ఏయే కారణాలవల్ల వస్తుందో, మందులు ఎలా



పని చేస్తాయో అడిగి తెలుసుకుంటూండే వాడు. వాడి తండ్రి జబ్బు మాత్రం ఊరి వైద్యుడికి అంతుపట్టలేదు.

సుశాంతుడికి శరీర శాస్త్రం గురించి కొంత అర్థమయ్యాక, తండ్రి జబ్బు ఎలా కుదర్చవచ్చునో స్ఫురించింది. తండ్రికి తెలియకుండా, ఆయనకోసం వాడు తల్లికి చెప్పి, కొన్ని ప్రత్యేకమైన వంటకాలు వండించేవాడు. వాటి ప్రభావం వల్ల మూడు మాసాలలో గంగరాజు జబ్బు తగ్గిపోయింది. అప్పుడు సుశాంతుడు తండ్రికి తన వైద్యం గురించి చెప్పాడు. గంగరాజు ఆశ్చర్యపోయి, జరిగింది ఊరి వైద్యుడికి చెప్పాడు.

వైద్యుడు తెల్లబోయి, "రాజధానిలో, నా బంధువొకడు నలుగురు ధనవంతులకు వైద్యం చేస్తున్నాడు. ఆయన వైద్య శాస్త్రంలో నిధి. ఆయనకే, నీ జబ్బు అంతుబట్టలేదు. మీ అబ్బాయి తెలివి సామాన్యమైనదికాదు. వజ్రాన్నయినా సానబట్టాలి గదా! మీ వాడిని, ఏ గురుకులానికైనా పంపి చదివించు," అని సలహా యిచ్చాడు.

గంగరాజుకూ కొడుకును చదివించాలని వున్నది. ఆయన కొడుకును వెంటబెట్టుకుని, రాజధానీ నగరానికి బయలుదేరాడు. రాజధానిలో దిలీపుడనే గురువు సకలశాస్త్ర పారంగతుడని ఆయనకు తెలిసింది.

దారిలో గంగరాజు ఒక గ్రామంలో బసచేశాడు. అక్కడ ఆయనకొక బంధువున్నాడు. ఆ బంధువు సుశాంతుణ్ణి పరీక్షించి, "మీవాడు గొప్ప కవి అవుతాడు. మా అబ్బాయి చంద్రుడు, దిలీపుడి వద్ద కవిత్వం నేర్చుకుంటున్నాడు. నువ్వు ముందు వాడి దగ్గిరకు వెళ్ళి, సంగతి చెప్పు. వాడు తప్పక సాయం చేస్తాడు. ఎందుకంటే దిలీపుడు అందర్నీ చేర్చుకోడు. తన శిష్యులు ముందుగా పరీక్షించి పనికివస్తాడన్నవాడినే, ఆయన శిష్యుడుగా స్వీకరిస్తాడు," అన్నాడు.

గంగరాజు అక్కణ్ణించి బయలుదేరి మరొక గ్రామంలో బసచేశాడు. అక్కడ ఆయన బసచేసింది గ్రామాధికారి ఇంట. గ్రామాధికారి సుశాంతుడి వినయవిధేయతలు చూసి ముచ్చటపడి, వాణ్ణి ఎన్నో ప్రశ్నలడిగాడు.

తర్వాత ఆయన గంగరాజుతో, "సుశాంతుడికి యుద్ధవిద్యలు నేర్పించండి. ఏ గురువూ నేర్పకుండానే వాడు ఎన్నో వ్యాయామాల గురించి తెలుసుకున్నాడు. వాడి శరీరం తీర్చిదిద్దినట్టున్నది. రాజధానిలో దిలీపుడి వద్ద, నా చిన్న తమ్ముడు వీరభద్రుడు యుద్ధవిద్యలు అభ్యసిస్తున్నాడు. మీరు వాడి సాయం తీసుకోండి," అన్నాడు.

గంగరాజు మళ్ళీ అక్కడి నుంచి ప్రయాణమయాడు. రాజధాని చేరుకునే లోగా, ఆయన మరి మూడు గ్రామాల్లో బసచేశాడు. అక్కడి వాళ్ళందరూ సుశాంతుడి వినయవిధేయతలకూ, తెలివితేటలకూ చాలా ఆశ్చర్యపడ్డారు. కొందరు వాడికి వైద్యం నేర్పించమన్నారు; మరి కొందరు సంగీతం చెప్పించితే బావుంటుందన్నారు; ఇంకా కొందరు వాణ్ణి శిల్పిని చేయమన్నారు. గంగరాజు అన్ని సలహాలూ విని, తలవూపి వూరుకున్నాడు.

చివరకు తండ్రీ కొడుకు లిద్దరూ రాజధానీ నగరం చేరి, ఒక సత్రంలో బసచేశారు.

గంగరాజు బాగా ఆలోచించి, దిలీపుడినికాక ముందుగా చంద్రుడిని కలుసు



కోవాలనుకున్నాడు. చంద్రుడు అక్కడి బంధువుల ఇంట్లో వుంటున్నాడు. రోజూ సాయంత్రం వేళ వాడు గురువు దిలీపుడి దగ్గిరకు వెళ్ళి వస్తూంటాడు. ఇందువల్ల చంద్రుడు బాగా పొద్దుపోయిగాని ఇల్లు చేరడు. ఆ కారణంగా బాగా పొద్దెక్కగాని నిద్రలేవడు.

గంగరాజూ, సుశాంతుడూ ఉదయానే చంద్రుడి ఇంటికి వెళ్ళారు. వాడింకా నిద్రలేవలేదు. ఇంట్లో ఒకావిడ వాణ్ణి బలవంతంగా నిద్రలేపింది.

చంద్రుడు విసుక్కుంటూ, గంగరాజూ, సుశాంతుడూ వున్నచోటుకు వచ్చి, గంగరాజును వచ్చిన పని ఏమిటని అడిగాడు. గంగరాజు చెప్పాడు.

"మీ వాడు యింతకుముందు ఎవరి దగ్గిరైనా విద్యాభ్యాసం చేశాడా?" అని ప్రశ్నించాడు చంద్రుడు.

"అలాంటిదేం లేదు," అన్నాడు గంగరాజు.

"ఎంతో కొంత చదువు నేర్చినవాళ్ళకు తప్ప, ఇతర్లకు మా గురువుగారు విద్య నేర్పడు. మీరు సరాసరి ఆయన దగ్గిరకు విద్య నేర్వడానికి రావడం అహంకారం అనిపించుకుంటుంది. ఆయన దేన్నయినా సహిస్తాడుగాని, అహంకారాన్ని మాత్రం అసలు సహించడు," అన్నాడు చంద్రుడు.

"అందుకే నీ సాయం కోరివచ్చాను. మా వాడిని, నీ దగ్గిర వదిలిపెడతాను.





"మా గురువు దేన్నయినా సహిస్తాడు గాని, ఆలస్యాన్ని సహించడు. సాయంత్రం రండి!" అని వీరభద్రుడు వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం తండ్రీ కొడుకు లిద్దరూ మళ్ళీ వాడింటికి వెళ్ళారు.

"గతంలో మీవాడు ఎక్కడైనా యుద్ధ విద్యలు అభ్యసించాడా ?" అని అడిగాడు వీరభద్రుడు, సుశాంతుణ్ణి పరీక్షగా చూస్తూ.

చంద్రుడి వద్ద తనకు కలిగిన అనుభవాన్ని దృష్టిలో వుంచుకుని గంగరాజు, "మా ఊళ్ళో ఒక గురువు దగ్గిర కొంత వరకూ అభ్యసించాడు." అని జవాబు యిచ్చాడు.

"మా గురువు ప్రారంభం నుంచీ తన దగ్గిరకు వచ్చినవారికే తప్ప, ఇతర్లకు విద్య నేర్పడు. కొంతకాలం ఒకరివద్ద విద్య నేర్చే ప్రయత్నం చేసి, వాళ్ళవల్ల కాకపోతే, అప్పుడు తన దగ్గిరకు వచ్చే వాళ్ళంటే, ఆయనకు చాలా చిరాకు," అన్నాడు వీరభద్రుడు.

నువ్వే వాడిని మీ గురువు దగ్గిర చేర్పించు," అన్నాడు గంగరాజు.

చంద్రుడు, సుశాంతుణ్ణి కవిత్వంలో కొన్ని క్లిష్టమైన ప్రశ్నలు వేశాడు. సుశాంతుడు సరయిన జవాబులు యివ్వలేక పోయాడు.

"ఈమాత్రం తెలియని నీకు, దిలీపుడు గురువు కావాలా ? మరీ అంత అత్యాశ పనికిరాదు, వెళ్ళు!" అన్నాడు చంద్రుడు కోపంగా.

తర్వాత గంగరాజూ, సుశాంతుడూ వీరభద్రుడి ఇంటికి వెళ్ళారు. వీరభద్రుడు అప్పుడే గురుకులానికి బయలుదేరుతున్నాడు.

అప్పుడు గంగరాజు, "బాబూ, నేను చెప్పింది అబద్ధం. చంద్రుడనే దిలీపుడి శిష్యుడు చెప్పినదాన్ని బట్టి — అలా చెప్పాను," అన్నాడు.

వీరభద్రుడు జరిగింది విని, "కవిత్వం నేర్చుకోదలచినవాళ్ళ విషయంలో అది నిజం కావచ్చు. కవులు యితరులను

ఆశ్రయించి బతికేవాళ్ళు. వాళ్ళు తమకు ఆశ్రయం యిచ్చి పోషించేవాళ్ళ మెప్పు కోసం, ఒకే ఇతిహాసాన్నీ, పురాణాన్నీ మరొకసారి తిప్పి రాస్తామంటారు. కాని, యుద్ధవిద్యల విషయంలో అలా కాదు! ప్రతి వారికీ ఒక కొత్త పద్ధతి అంటూ వుంటుంది. యుద్ధవిద్యలు నేర్చినవాడు ఇతరుల మీద ఆధారపడడు," అన్నాడు గర్వంగా.

"జరిగిందేదో జరిగింది. ఇప్పుడు నువ్వే, మావాడిని దిలీపుడి దగ్గిర చేర్పించాలి," అన్నాడు గంగరాజు.

వీరభద్రుడు, సుశాంతుణ్ణి కొన్ని ప్రశ్నలడిగి, "మీ వాడు వ్యవసాయానికేగాని, యుద్ధ విద్యలకు పనికిరాడు. ఇలాంటి వాణ్ణి చేర్చుకోమని చెబితే, మా గురువుగారు నా మీద కోపం తెచ్చుకుని, నాకే ఉద్వాసన చెప్పవచ్చు," అన్నాడు.

గంగరాజు నీరసపడిపోయి అక్కణ్ణించి బయలుదేరాడు. ఆ పైన అన్నిచోట్లా ఆయనకు అటువంటి అనుభవమే ఎదురయింది.

సత్రం యజమాని రోజూ, యీ తండ్రీ కొడుకులు ఎక్కడికో వెళ్ళి తిరిగి రావడం గమనిస్తున్నాడు. ఆయన సంగతేమిటని గంగరాజును అడిగాడు. గంగరాజు తన ఇబ్బంది చెప్పుకున్నాడు.



"ఈ స్వల్పానికి యింత కష్టపడుతున్నారా, మీరు? దిలీపుడి శిష్యులకు ఏ రాజాస్థానంలో అయినా క్షణాల మీద ఉద్యోగం దొరుకుతుంది. అంతే కాక, దేశమంతటా గౌరవంతోపాటు, ఘన సన్మానాలు కూడా లభిస్తాయి. అందువల్ల, ఆయన ఎవరుపడితేవాళ్ళను శిష్యులుగా చేర్చుకోడు. పదివేల వరహాలు ఎవరు యిచ్చుకోగలిగితే, వారికే ఆయన చదువు చెబుతాడు," అన్నాడు సత్రం యజమాని, చిన్నగా నవ్వుతూ.

గంగరాజు ఒక క్షణం ఆశ్చర్యపోయి వెనుదిరిగాడు. సుశాంతుడు తండ్రిని అనుసరించాడు. వాళ్ళు అప్పటికప్పుడే

రాజధానీ నగరం వదలి, ఇంటిదారి పట్టారు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, గంగరాజులోభి అని రుజువవుతున్నదిగదా! అతడు పదివేలవరహాల వ్యయానికి జంకి, ఒక్కగానొక్క కొడుకు చదువుకు అడ్డు పడడం అనాలోచితం కాదా? ఈసందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గంగరాజు లోభి కాదు. కొడుకు చదువు విషయంలో అతడు తీసుకున్న నిర్ణయం అనాలోచితం కానేకాదు. అతడు ముఖ్యంగా నగరం చేరినప్పటి నుంచీ దిలీపుడి శిష్యులవల్ల కలిగిన అనుభవాలు, అతణ్ణి అలాంటి నిర్ణయం తీసుకునేందుకు ప్రోత్సహించినై. శిష్యుడి అర్హతనుబట్టి కాక, డబ్బును బట్టి చదువు చెప్పేవాడు సరైన గురువు అనిపించుకోడు. దిలీపుడు సమర్థుడైన గురువు కావచ్చు! ఆయన పాండిత్యం శిష్యులను విజ్ఞానపరులనుగా కాక, ధనార్జనాపరులను చేస్తుంది. ఇందుకు ఉదాహరణ ఆయన శిష్యులే. వాళ్ళల్లో ఆవగింజపాటి వినయం కూడా లేదు. అందరూ రాటుదేరిన దురహంకారులు. సుశాంతుడు ఏ పెద్ద చదువులూ లేకుండానే, ఇంటిపట్టున వుండి తనకు పనుల్లో సాయపడుతూ, ప్రకృతి నుంచీ, లోకుల నుంచీ ఎంతో విజ్ఞానం సముపార్జించాడు. అతడి వినయం, తెలివితేటల్ని ఊళ్ళో అందరూ మెచ్చుకోవడమే కాక, తమకు ఎదురైన సమస్యల్ని అతడికి చెప్పి, తృప్తికరమైన సమాధానాలు పొందేవారు. అలాంటి వాణ్ణి, దిలీపుడికి పదివేల వరహాలు ముడుపు చెల్లించి శిష్యుడుగా చేర్చడమంటే—అది కోరి కొరవితో తల గోక్కోవడమవుతుంది. ఇలా ఆలోచించే అతడు, కొడుకుతో ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అసంతృప్తి

రాయవరం జమీందారు దగ్గిరకు, కేశవుడనేవాడు ఉద్యోగం కోసం వచ్చాడు. జమీందారు వాణ్ణి కొన్ని ప్రశ్నలడిగి, వాడిచ్చిన జవాబులకు తృప్తిపడి, "నీకు జీతం ఎంత కావాలి?" అన్నాడు.

"తమ ఇష్టం!" అన్నాడు కేశవుడు.

"కాదు, నీకెంత కావాలో అడుగు," అన్నాడు జమీందారు.

కేశవుడు సంకోచిస్తూనే, "రెండువంద లిప్పించండి," అన్నాడు.

జమీందారు అందుకు సరేనని, రేపే వచ్చి పనిలో చేరమన్నాడు. ఆ క్షణం నుంచీ కేశవుడిలో అసంతృప్తి బయలుదేరింది. తను తొందరపడి జీతం రెండువందలడిగాడు. అలా కాక, మూడు వందలడిగినా జమీందారు ఒప్పుకునేవాడేమో! అదీ వాడి దిగులుకు కారణం.

మర్నాడు వాడు, జమీందారింటికి పోయి, తను పనిలోకి వచ్చినట్టు చెప్పాడు. జమీందారు కొంచెం బాధపడుతున్నట్టు ముఖం పెట్టి, "ఒరే, ఏమీ అనుకోకు, ఈ పది రూపాయిలు తీసుకుపో. ముందు చెప్పాపెట్టకుండా వెళ్ళిన నౌకరు తిరిగి వచ్చి, క్షమించమని కాళ్ళా వేళ్ళాపడుతున్నాడు," అన్నాడు.

కేశవుడు, జమీందారిచ్చిన పది రూపాయిలూ తీసుకుని, "అయ్యా, నాకీ ఉద్యోగం రాకపోవడం చాలా సంతోషం కలిగిస్తున్నది," అన్నాడు.

"ఎందువల్ల?" అంటూ జమీందారు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"అది తమకు మనవి చెయ్యలేను; కానీ ఒక చిన్న విన్నపం. దయచేసి యికముందు ఉద్యోగం కావాలంటూ వచ్చినవాడిని జీతం ఎంత కావాలని అడక్కండి. పనినిబట్టి, ఆ జీతమేదో తమరే నిర్ణయించండి!" అన్నాడు కేశవుడు.

కేశవుడు యిలా ఎందుకన్నాడో, ఎంత ఆలోచించినా జమీందారుకు అర్థం కాలేదు.

—దాసరి వెంకటరమణ





# మాటచుట్టం-పూటచుట్టం

రంగరాజపురం చిన్న గ్రామం. అక్కడి ప్రజల్లో ముప్పాతిక భాగం నేతపని మీద జీవయాత్ర సాగించేవారు. వారిలో గణపతి, చలపతి అనేవాళ్ళు, ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళే కాక చిన్ననాటి నుంచి మంచి స్నేహితులు.

వాళ్ళిద్దరూ మగ్గాల మీద చక్కటి జరీ పనితనమున్న వస్త్రాలు నేసి, వాటిని పట్నం తీసుకుపోయి పెద్ద వర్తకులకు అమ్ముకునేవారు.

గణపతికి సొంత ఎద్దుబండి వున్నది. అతడు పట్నానికి బండి మీద వెళ్ళి వస్తూండేవాడు. చలపతిది పెద్ద సంసారం. అతడికి బండి కొనే తాహతులేదు. అందుచేత బాడుగబండి మీద పట్నం వెళ్ళి వస్తూండేవాడు. బాడుగబళ్ళు దొరకనప్పుడు, వస్త్రాలమూట నెత్తిన పెట్టుకుని బయలుదేరే వాడు.

తనమేలూ, అవసరాలేతప్ప—ఆఖరికి స్నేహితుల అవసరాలు కూడా పట్టించుకోని స్వభావం గణపతిది. తన బండి ఖాళీగా ఇంటి ముందు పడివున్నా, చలపతి అవసరానికి దాన్ని యిచ్చేవాడు కాదు. పైగా, చలపతి ఆర్థికపరిస్థితి తెలియనివాడిలా, "ఏం, చలపతీ! ఎంత కాలమిలా బాడుగబళ్ళ మీద ఆధారపడి వ్యాపారం చేస్తావు? నా మాట విని, సాధ్యమైనంత త్వరగా సొంతబండి కొనుక్కో. ఎంతయినా సొంతబండి విలువ సొంతబండిదే!" అనేవాడు.

ఇలాంటి సలహాలు విని, చలపతి నవ్వి వూరుకునేవాడు.

ఆ గ్రామంలోనే వాళ్ళిద్దరికీ రామం అనే ఒక స్నేహితుడున్నాడు. అతను బాగా చదువుకున్నవాడు. అయినా, తగిన ఉద్యోగం దొరకక వ్యవసాయప్పనుల్లో

గవ్వల నిర్మలాదేవి

తండ్రికి సాయపడుతూ గ్రామంలోనే వుండిపోయాడు.

కొన్నాళ్ళ తర్వాత అతడికి పట్నంలోని ఒక బంధువు పలుకుబడివల్ల, అక్కడ ఉద్యోగం దొరికింది. ఆ కారణం వల్ల రామం భార్యా పిల్లలతో పట్నం వెళ్ళి కాపరం పెట్టాడు.

రామం పట్నం చేరాక, గణపతి, చలపతుల్లో ఎవరు పట్నం పోతున్నా, రామం తల్లి తన కొడుక్కు పిండి వంటలూ, ఏవో పచ్చళ్ళూ, వాళ్ళ ద్వారా పంపుతూండేది.

రామం స్నేహితులు తన ఇంటికి వచ్చినప్పుడల్లా, భోజనం చేసి వెళ్ళమని పట్టుపట్టేవాడు. రామం భార్య సుమతి కూడా మంచి కలుపుగోలు మనిషి. ఆమె వంటలు అద్భుతంగా చేస్తుంది.

చలపతి, రామానికి ఏదో ఒకటి సర్ది చెప్పి, తను వచ్చిన పని అయ్యాక వెళ్ళి పోతూండేవాడు.

గణపతి మాత్రం వెళ్ళిన ప్రతి పూటా రామం ఇంట విస్తరేస్తూండేవాడు. లోగడ అతడికి పట్నంలో ఎక్కడా సరయిన భోజనవసతిలేక, చాలా అవస్థగా వుండేది. అంతే కాక అతడు మంచి భోజన ప్రియుడు.

ఇలా కొంతకాలం జరిగాక, క్రమంగా రామం ఇంట తనకు మర్యాద తరిగి పోతున్నట్టు, గణపతికి అనుమానం కలిగింది. సుమతీ, పిల్లలూ అంటీ ముట్టనట్టు



మాట్లాడడమేకాక, అతడి ఎదట చలపతిని తెగమెచ్చుకుంటూండేవాళ్ళు.

గణపతి ఒకసారి చలపతి ఇంటికి వెళ్ళి, వ్యాపార విషయాలు కొంతసేపు మాట్లాడి, తరవాత, చలపతితో, "నువ్వు కూడా యీ సంగతి గ్రహించే వుంటావను కుంటాను. స్నేహం విలువ పల్లెల్లో జీవించే, మనబోటివాళ్ళకే తెలుసు. పట్టణ జీవితమే వేరు. ఇందుకు ఉదాహరణ రామం. అతడికీ, భార్యకూ పట్నంగాలి బాగా సోకింది. వాళ్ళల్లో మునుపటి ఆత్మీయతా, అభిమానాలూ తగ్గిపోయాయి సుమా!" అన్నాడు.

చలపతి ఆశ్చర్యపోతూ, "నాకలా అనిపించడం లేదు. రామంవాళ్ళు, నాపట్ల పూర్వంలాగే వున్నారు," అన్నాడు.

గణపతి కొంచెం వెటకారంగా, "ఆ మాటా నిజమే మరి! నిన్ను మాత్రం వాళ్ళు ఆకాశానికెత్తి మాట్లాడుతూంటారు. ఇందులో వున్న కిటుకేమిటో బోధపడడం లేదు," అన్నాడు.

"ఇందులో వున్న కిటుకు ఒక్కటే. ఏనాడూ మాటచుట్టానికున్న విలువ, పూట చుట్టానికి లేదు!" అన్నాడు చలపతి.

గణపతికి వీపున ఛెళ్ళున చరిచినట్టయింది. చలపతికి రామం ఇంట వున్న గౌరవానికి కారణం అప్పటికి అతడికి తెలిసివచ్చింది.

పిల్లాపాపల్తో పట్నంలో కాపరం చేస్తున్న రామం లాంటి చిన్న ఉద్యోగస్థుడి ఇంట, భోజనప్రియుడైన తను, వెళ్ళినప్పుడల్లా ఉచితభోజనం చేయడం, వాళ్ళకు చాలా భారమనిపించే సంగతి!

ఇది గ్రహించాక గణపతి స్వభావంలో చాలా మార్పు వచ్చింది. ఎదుటివారి కష్టసుఖాలు తెలుసుకుని, దానికి అనువుగా మసులుకోవడం నేర్చుకున్నాడు. అతడు చలపతి అవసరానికి తన బండి యివ్వడమేకాక, పట్నం వెళ్ళినప్పుడల్లా రామం పిల్లలకు ఏవో చిన్న, చిన్న బహుమతులు యిస్తూ, తప్పనిసరయితేతప్ప, లేకపోతే ఆ ఇంట భోజనానికుండడం మానుకున్నాడు.



# రాక్షస నీతి!

కాశీకి బయలుదేరిన ఒక భక్తుల బృందం, ఒక అడవిగుండా ప్రయాణం చేయవలసి వచ్చింది. ఆ అడవిలో ఒక రాక్షసుడున్నాడు. వాడికి అంతమంది మనుషులను ఒక్కసారి చూడగానే చిన్న తమాషా చేయాలనిపించింది.

వాడు ఒక మహావృక్షం మీదినుంచి హుంకారం చేస్తూ, వాళ్ళ ముందు దూకాడు. భక్తులందరూ గజగజ వణకసాగారు.

రాక్షసుడు వాళ్ళతో, "భయపడకండి! మీలో ఎవరో ఒకరు, తనంతట తాను, నాకు ఆహారం కావడానికి సిద్ధపడితే, మిగిలిన వారినందరినీ వదిలేస్తాను. అలా కాకపోతే, అందరినీ చంపేస్తాను," అన్నాడు.

భక్తులందరూ ఎవరికివారు, తన పక్కవాడు రాక్షసుడికి ఆహారం అయేందుకు సిద్ధపడితే బావుండుననుకున్నారే గాని, ఒక్కడూ ముందుకు రాలేదు. అది గమనించిన రాక్షసుడు అందర్నీ చంపడానికి సిద్ధపడ్డాడు.

అప్పుడు భక్తబృందంలోని సారంగపాణి అనే భక్తుడు ముందుకు వచ్చి, "రాక్షసోత్తమా! నన్ను భక్షించి మిగిలిన వారినందరినీ వదిలిపెట్టు!" అన్నాడు.

రాక్షసుడు చిన్నగా నవ్వి, సారంగపాణిని వదిలి, మిగిలిన వారినందరినీ భక్షించాడు.

—యన్. శివనాగేశ్వరరావు





# ఎవరు గొప్ప?

బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు కాశీ రాజు కుమారుడై జన్మించాడు. ఆయన తక్షశిలకు వెళ్ళి పదహారేళ్ళు నిండేలోపుగానే సమస్త శాస్త్ర పురాణాలన్నీ చదివేశాడు. తరవాత తండ్రి చనిపోగా ఆయన కాశీ దేశానికి రాజయి, ధర్మం ఏ మాత్రమూ తప్పకుండా రాజ్యపాలన చేయసాగాడు.

ఆయన పరిపాలనలో ప్రజలు ఎట్టి బాధలూ, అరిష్టాలూ, అన్యాయాలూ, అక్రమాలూ లేక సుఖజీవనం గడుపుతూ రావటం చేత, న్యాయస్థానం పూర్తిగా పాడుబెట్టినట్టయిపోయింది. ఎన్ని ఏళ్ళు గడిచినా రాజాస్థానానికి ఒక్కడూ రాడు, ఫిర్యాదు చెయ్యడు. ప్రజలలో ఎట్టి ఆందోళన లేకపోవటంచేత రాజుకు తన వల్ల ఏ లోపాలు జరుగుతున్నదీ, తనను గురించి ప్రజలేమనుకుంటున్నదీ తెలియలేదు. కనీసం వ్యాజ్యాల మీద ఆస్థానానికి వచ్చిపోయే వారున్నా వారి ద్వారా రాజు తన లోపాలు తెలుసుకోవటానికి వీలుండేది; కాని, ఆస్థానంకేసి తొంగి చూసేవాళ్ళే కరువయారు.

అందుచేత ఒకనాడు రాజు తన రథం ఎక్కి కాశీ నగరమంతా తిరుగుతూ, కనిపించినవారినల్లా, "నా పరిపాలనలో మీకేం లోపాలు కనిపించాయి?" అని అడగసాగాడు.

కాని ఎంతమంది నడిగినా ప్రతి ఒక్కరూ, "మేము తమ పరిపాలనలో చాలా సుఖంగా ఉన్నాం, మహారాజా! మాకు ఏ లోపమూ కనిపించటం లేదు!" అని చెబుతూ వచ్చారు.

అప్పటికీ రాజుకు తృప్తి కలగలేదు. ఆయన తన రాజలాంఛనాలన్నీ తీసివేసి,

సామాన్యుడి వేషంలో రథం మీద నగరం దాటి పల్లెపట్టుల వెంట ప్రయాణం చేస్తూ, తనను గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో వినటానికి పూనుకున్నాడు. అయన ఎన్ని గ్రామాలకు వెళ్ళినా కాశీరాజు గురించి పల్లెత్తు అక్షేపణ ఎక్కడా వినపడలేదు.

చివరకు రథం రాజ్యపు సరిహద్దు చేరుకుని సరిహద్దు బాట వెంబడి తిరిగి రాజధానికి వస్తున్నది.

ఆసమయంలో కాశీ రాజెక్కిన రథానికి మరొక రథం ఎదురు వచ్చింది. రెండు రథాలూ ఒకదాన్నొకటి తప్పుకుపోయే అవకాశం లేదు. ఎందుకంటే, అది చాలా ఇరుకు బాట. దానికి రెండు పక్కలా ఎత్తయిన గట్లున్నాయి.

రెండు రథాలూ ఒకదానికొకటి అంత దూరంలో ఆగాయి.

"మేము ముందుకు వెళ్లాలి! నీ రథాన్ని వెనక్కు తిప్పుకో!" అన్నాడు కాశీరాజు సారథి.

"నన్ను రథం తిప్పమనటానికి నీకేమి అధికారం ఉన్నది? నువే నీ రథాన్ని వెనక్కు తిప్పు!" అన్నాడు రెండవ రథం లోని సారథి.

ఇద్దరు సారథులూ కోపావేశంతో వితర్కంలో పడ్డారు.



"ఈ రథంలో ఉన్నదెవరో తెలుసా? కాశీరాజుగారు!" అన్నాడు కాశీరాజు సారథి.

"ఈ రథంలో ఉన్నది కోసల రాజు గారు!" అన్నాడు రెండవరథం తోలేవాడు.

కాశీరాజ్యం ఎంత పెద్దదో, కోసల రాజ్యం కూడా అంత పెద్దదే. వయసులోనూ, చదువులోనూ కోసల రాజైన మల్లికుడు కాశీరాజుకు సరిసమానుడు. అయన కూడా మారువేషంలో తన దేశమంతా తిరిగి, తనను గురించి ప్రజలేమనుకుంటున్నారో విని, తనవల్ల తప్పులున్నట్టయితే సరిచేసుకునే ఉద్దేశంతో బయలుదేరినవాడే.

"మీ రాజుగారిలో అధిక్యత ఏమిటి?" అని అడిగాడు కాశీరాజు సారథి.

దానికి కోసలరాజు సారథి వెంటనే ఈ విధంగా జవాబు చెప్పాడు :

దళహం దళహస్య ఖిపతిమల్లికో
ముదునా ముదుల,
సాధుంపి సాధునా జేతి అసాధుంపి
అసాధునా,
ఏతాదిసో అయం రాజా మగ్గా ఉయ్యాహి
సారథి ॥

[మా మల్లిక మహారాజుగారు దుష్టులకు దుష్టుడు, సజ్జనులకు సజ్జనుడు. మంచితనాన్ని మంచితనంతో బహూకరిస్తాడు. దుర్మార్గాల్ని దుర్మార్గంతో నిగ్రహిస్తాడు.]

ఇది వింటూనే కాశీరాజు సారథి ఈ విధంగా జవాబిచ్చాడు :

అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా
జినే,
జినే కదరియం దానేన సచ్చేన
అలివాదినం
ఏతాదిసో అయం రాజా మగ్గా ఉయ్యాహి
సారథి ॥

[మా మహారాజు ఆగ్రహాన్ని శాంతంతో జయిస్తాడు; దుర్మార్గాన్ని సాధుత్వంతో లొంగదీస్తాడు; బహుమానాలతో లోభులను ఓడిస్తాడు; అబద్ధాలకు ప్రతిఫలంగా సత్యాన్ని ఇస్తాడు.]

కాశీరాజు రథాన్ని తోలే సారథి అన్న ఈ మాటలు వినగానే కోసలరాజు మల్లికుడు ఆత్రంగా తన రథం నుంచి దిగి వచ్చి, కాశీరాజుకు ప్రణమిల్లి, "పుణ్యాత్మా, నా లోపం నాకు తెలిసి వచ్చింది. దానిని సరిచేసుకుని, ఇంకా ధర్మంగా పరిపాలన సాగిస్తాను!" అన్నాడు.

తరవాత కాశీరాజు తన నగరానికి తిరిగి వచ్చి, ధర్మం వెంట్రుకవాసి కూడా తప్పకుండా ప్రజారంజకంగా రాజ్యపాలన చేస్తూ వచ్చాడు. ఎప్పటి కప్పుడు ఆత్మ పరిశీలన చేసుకుంటూ సుఖంగా కాలం గడిపాడు.





# భారత పునరుజ్జీవనం

రాజకీయ చైతన్యం 1857వ సంవత్సరపు సిపాయిల తిరుగుబాటుకు దారి తీసినట్టే, భారత పునరుజ్జీవనానికి దోహదంచేసే నూతన భావాలూ, జాతీయ చైతన్యం, సంస్కరణలు దేశమంతటా వికసింపసాగాయి. నాటి సంఘసంస్కర్తలలో మున్నెన్నదగిన వాడు రాజారామ్ మోహన్‌రాయ్.

బెంగాల్‌లోని హుగ్లీ జిల్లాలో 1772వ సంవత్సరం జన్మించిన రామ్‌మోహన్ రాయ్ సంఘంలో పాతుకుపోయిన సతీ సహగమనం, వర్ణభేదాలు మొదలైన దురాచారాలను రూపుమాపడానికి కృషి చేశాడు. 1828వ సంవత్సరంలో బ్రహ్మ సమాజాన్ని స్థాపించి—దేవుడు ఒకడే అనీ, జాతిభేదాలను పాటించరాదనీ, స్త్రీజాతికి విముక్తి కల్గించాలనీ దీక్షతో ప్రచారం జరిపాడు.





ఆంగ్లేయులకు సరిసమానంగా భారతీయులను చూడాలని ఆయన కోరాడు. భారతదేశంలో ఇంగ్లీషు విద్యాబోధన అవసరాన్ని గుర్తించి, అందుకోసం కృషి జరిపాడు. ఢిల్లీ పాలకుడైన రెండవ అక్బర్ చక్రవర్తి, రామ్ మోహన్‌రాయ్‌ని 'రాజా' బిరుదంతో సత్కరించి భారతదేశం స్థితిగతులను ఆంగ్లేయులకు తెలియజేయడానికి ఆయనను ఇంగ్లాండుకు పంపాడు.



రాజారామ్‌మోహన్‌రాయ్ ఇంగ్లాండు
లోనే 1833వ సంవత్సరం మరణిం
చాడు. రామ్‌మోహన్‌రాయ్ తర్వాత
చెప్పుకోదగ్గ పండితుడూ, సంస్కర్త—
స్వామి దయానందసరస్వతి. ఆయన
గుజరాత్‌లోని మోర్వీలో 1824వ
సంవత్సరం జన్మించాడు. వేదాలకు
అయన నూతన వ్యాఖ్యానాలు రాశాడు.
అర్యసమాజం స్థాపించి ఎన్నో సంస్క
రణలను పవేశపెట్టాడు.

స్వామి దయానందసరస్వతి గొప్ప విద్యా
వేత్త. ఆయన ఆలోచనలు, హరిద్వారం
లోని గురుకుల విద్యాలయానికి ఎంతో
ప్రేరణ కల్గించాయి. కేవలం విషయా
లను తెలియజేయడం మాత్రమే
కాకుండా, గురుకుల విద్యా విధానం—
విద్యార్థులలో మన సంస్కృతీ వార
సత్వం విలువలను గ్రహింపజేసేదిగా
రూపొందించ బడింది.





1836వ సంవత్సరం బెంగాల్‌లోని
కుమర్‌పూర్ అనే గ్రామంలో శ్రీ
రామకృష్ణ పరమహంస జన్మించాడు.
ఆరేళ్ల ప్రాయంలో ఆయన—నల్లటి
మేఘాల మీదుగా ఎగిరే తెల్లటి కొంగల
బారును చూసి తన్మయం చెంది,
సర్వాన్ని మరచిపోయి ధ్యానసమాధి
స్థితిలో ఆధ్యాత్మికానందం పొంద
గలిగాడు.

రాణి రస్మయి కట్టించిన కాళికాలయంలో రామకృష్ణ, పూజారి అయ్యాడు. ఆయన దేవీదర్శనం పొంది, ఆమెతో ముఖాముఖి మాట్లాడేవాడట. ఆయన భిన్నభిన్న భక్తిమార్గాలను ఆచరించి చూసి, అన్ని మార్గాలూ ఒకే దైవ గమ్యానికి చేరుస్తాయని కనుగొన్నాడు.





రామకృష్ణ పరమహంస చేత పలువురు ఆకర్షింపబడి ఆయన భక్తులయ్యారు. గాఢమైన ఆధ్యాత్మిక సత్యాలను, ఆయన సరళంగా, సూటిగా తెలియజేయడం భక్తులను ముగ్ధుల్ని చేసేది. క్రమంగా రామకృష్ణపరమహంసభక్తులు ఆయనను భగవదవతారంగా భావించసాగారు.

రామకృష్ణ పరమహంస చేత ఆకర్షింపబడ్డ వారిలో, నరేంద్రు డనే యువకుడిగా ఆయనను ఆశ్రయించిన స్వామి వివేకానంద ముఖ్యుడు. 1863వ సంవత్సరం జన్మించిన స్వామి వివేకానంద 1881వ సంవత్సరంలో రామకృష్ణ పరమహంసను ప్రప్రథమంగా దర్శించి, శిష్యుడయ్యాడు.





1893 వ సంవత్సరం అమెరికాలోని చికాగో నగరంలో జరిగిన ప్రపంచ సర్వమత సమావేశంలో స్వామి వివేకానంద పాల్గొన్నాడు. అక్కడ ఆధ్యాత్మిక విషయాలను అద్భుతంగా వివరిస్తూ, స్వామి వివేకానంద ఇచ్చిన అనర్గళమైన ఉపన్యాసం విని పాశ్చాత్య జిజ్ఞాసువులు ఆశ్చర్యం చెందారు.

1893 వ సంవత్సరమే ఇంగ్లాండులో విద్యను పూర్తి చేసుకుని, యువకుడైన అరవిందుడు భారతదేశానికి తిరిగి వచ్చాడు. ఉత్తరోత్తరా అరవిందుడు 'భారత జాతీయ ప్రవక్త' గా పేరు గాంచాడు.






ఆ కాలఘట్టంలోనే ప్రముఖ నవలా రచయితా, కవీ అయిన బంకించంద్ర చటర్జీ సుప్రసిద్ధమైన 'వందేమాతరం' గీతం రచించాడు. 'వందేమాతరం' దేశభక్తి గీతం – స్వాతంత్ర్య సమర యోధులకు తారకమంత్రంగా ఉత్తేజం కల్గించింది.



# రెండు పిశాచాలు

దేవరపల్లి చాలా చిన్న గ్రామం. ఆ గ్రామంలో గోవిందయ్య అనే ఒక సామాన్య గృహస్థు వుండేవాడు. ఆయనకు ఒకే ఒక కుమార్తె; ఆమె పేరు సుభాషిణి.

సుభాషిణికి పెళ్ళీడు వచ్చింది. గోవిందయ్య పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాడు. కాని, ఎక్కడికి వెళ్ళినా కట్నం వేలలో అడగసాగారు. అతడికి ఏం చేయాలో తెలియక దిగులుపడిపోయాడు.

అలాంటి సమయంలో పట్నంలో వ్యాపారం చేస్తున్న సుదర్శనం అనే గోవిందయ్య చిన్ననాటి స్నేహితుడు అతణ్ణి చూడవచ్చాడు. మాటల సందర్భంలో గోవిందయ్య, అతడికి తన కుమార్తె పెళ్ళి సమస్య గురించి చెప్పాడు.

''కట్నం యిచ్చుకునే స్తోమతు లేదని, అలా కాలం గడిపేస్తే ఎలా? సుభాషిణికి ఇరవై ఏళ్ళంటున్నావు. మంచి సంబంధం చూడు. ఐదారువేలదాకా నేను సర్దగలను. అది తీర్చడం సంగతి తరవాత ఆలోచించవచ్చు,'' అన్నాడు సుదర్శనం.

స్నేహితుడి ఆసరా చూసుకుని గోవిందయ్య, ఈసారి కూతురుకు మంచి సంబంధం కోసం వెతికి, వెతికి చివరకు దూరగ్రామంలోని ఒక యువకుడితో పెళ్లి నిశ్చయం చేశాడు. వరుడి తల్లిదండ్రులు మూడువేలు కట్నం కావాలన్నారు.

ఈ పెళ్ళి ప్రయత్నం ఒక కొలిక్కి రావడానికి ఆరు నెలల కాలం పట్టింది. ఇంకా వివాహముహూర్తం పదిహేను రోజులున్నదనగా, గోవిందయ్య పట్నం వెళ్ళి సుదర్శనానికి సంగతి చెప్పాడు.

సుదర్శనం ఆశ్చర్యపోతున్నట్టు ముఖం పెట్టి, ''ఐదారువేలు సర్దగలనన్నానా? నాకు సరిగా గుర్తురావడం లేదు. సరే, ఏది ఏమైనా యిప్పటి నా వ్యాపారపరిస్థితి

మాచిరాజు కామేశ్వరరావు



నడవసాగాడు. ఆ దారివెంటబళ్ళూ, మను షులూ తరచుగా ప్రయాణం చేస్తూంటారు. ఆ కారణం వల్ల అతడికి చీకటీ, చిట్టడవీ అన్న భయం ఏమాత్రం కలగలేదు.

ఒకచోట చెట్టుకొమ్మల్లో ఏదో అలికిడి కావడంతో, గోవిందయ్య చప్పున తలఎత్తి చూశాడు. ఒక నల్లని ఆకారం కొమ్మల్లోంచి అతడి ముందుకు దూకి, "ఇంత చీకటి వేళ ఒంటరి ప్రయాణం ఏమిటి? నీకేం భయంగా లేదా?" అని అడిగింది.

గోవిందయ్య సహజంగా మంచి ధైర్య శాలి. అతడు తన దారికి అడ్డుగా నిలబడింది పిశాచి అని గ్రహించాడు. భయపడేవాళ్ళంటే పిశాచాలకు మరింత లోకువ. అందువల్ల, గోవిందయ్య పిశా చాన్ని నిలువెల్లా ఒకసారి పరీక్షగా చూసి, "భయం ఎందుకు! పని పడి యిక్కడికి దాపుల్లో వున్న ఒక గ్రామానికి వెళుతు న్నాను," అన్నాడు.

"అక్కడ నీకేం పనో చెబితేనే, వెళ్ళ నిస్తాను," అంటూ పిశాచం గోవిందయ్య దారికి అడ్డంగా వచ్చింది.

"ఆ పనేదో ఎంతోమందికి చెప్పి విసిగి పోయాను, ఇక మిగిలింది నువ్వే," అంటూ సంగతంతా చెప్పి, "మొత్తానికి, యీ జన్మలో మా అమ్మాయికి వివాహ యోగం వున్నదో లేదో," అన్నాడు.

ఏమీ బాగా లేదు. ఈమధ్య విపరీతంగా నష్టపోయాను," అన్నాడు.

ఈ జవాబుకు గోవిందయ్య నిర్ఘాంత పోయాడు. అతడికి కోపం వచ్చినా, స్నేహితుణ్ణి ఏమీ అనక గ్రామం తిరిగి వచ్చాడు.

కాబొయ్యే వియ్యంకుడికి నచ్చజెప్పి, వివాహముహూర్తం ప్రస్తుతానికి వాయిదా వేయించడం ఒక్కటే గోవిందయ్యకు మంచి మార్గంగా తోచింది. అతడు ఒక సాయంత్రం వేళ వియ్యాలవారుండే గ్రామానికి బయలుదేరాడు.

చీకటిపడుతూండగా గోవిందయ్య ఒక చిట్టడవిప్రాంతాన్ని చేరి, కొంచెం వేగంగా

వెంటనే పిశాచం, "ఎందుకులేదు! అనుకున్న ముహూర్తానికి, మీ అమ్మాయి పెళ్ళి జరిగి తీరుతుంది. ఆ మూడువేలూ నేనిస్తాను," అన్నది.

గోవిందయ్య ఆశ్చర్యంగా చూసేంతలో, పిశాచం చెట్టు మీదికి పోయి, ఒక చిన్న మూటతో తిరిగి వచ్చి, "ఇందులో మూడు వేలున్నవి. ఇంటికి తిరిగిపోయి లక్షణంగా, నీ కూతురు పెళ్లి జరిపించు," అన్నది.

గోవిందయ్య డబ్బుతో తెల్లవారుజామున ఇంటికి తిరిగి వచ్చాడు. నిశ్చయించిన ముహూర్తాన సుభాషిణి పెళ్ళి జరిగిపోయింది. వియ్యాలవారు పిశాచం యిచ్చిన మూడువేల రూపాయిలు భద్రంగా దాచుకున్నారు.

మూడు రోజుల తరవాత పెళ్ళికొడుకు తండ్రి, భార్యతో, కొడుకూ కోడలితో బాడుగబండిలో తమ ఊరుకు ప్రయాణం అయాడు. దారిలో వాళ్ళు, పిశాచం వుండే చెట్టును సమీపించగానే పిశాచం, "ఓ, పిశాచమా నిన్ను చంపుతా! మింగుతా!" అంటూ పైనుంచి దూకింది.

పిశాచాన్ని చూస్తూనే బండిలో వున్న వాళ్ళందరూ గడగడ వణికిపోసాగారు. కొద్ది క్షణాల తర్వాత పెళ్ళికొడుకు తండ్రి కాస్త ధైర్యం తెచ్చుకుని, "మేము మనుషులం; పిశాచాలం కాదు. నా కొడుకు



పెళ్ళి చేసుకుని, మా ఊరు వెళుతున్నాం," అన్నాడు బొంగురుగొంతుతో.

"మా దగ్గర అరిసెలూ, సున్ని ఉండలూ వున్నవి. నీకు ఏవంటే యిష్టమో చెప్పు," అన్నది పెళ్ళికొడుకు తల్లి.

"బండిలో పిశాచం నాకు స్పష్టంగా కనిపిస్తున్నది. మింగుతా!" అంటూ పిశాచం మరికాస్త ముందుకు వచ్చింది.

పెళ్ళికొడుకు తల్లి బెంబేలుపడిపోతూ, "అది పిశాచం కాదు; మా కోడలు! సుభాషిణీ, నీ ముఖం కాస్త సరిగా చూపించు, తల్లీ!" అన్నది.

ఆ మాటలకు పిశాచం పెద్దగా నవ్వి, "నాకనిపిస్తున్నది, నీ మొగుడు దుస్తుల్లో

దాచుకున్న కట్న పిశాచం! నే మింగ దలిచింది, దాన్ని!'' అన్నది.

పెళ్ళికొడుకు తండ్రి దానితో బాగా ధైర్యం తెచ్చుకుని, డబ్బు మూటను పిశాచానికి చూపిస్తూ, ''ఇది, మా వియ్యంకుడు, అల్లుడికిచ్చిన కట్నం మూడు వేల రూపాయిల డబ్బు మూట. సరిగా చూడు!'' అన్నాడు.

పిశాచం డబ్బు మూటను ఒకసారి తాకి, అసహ్యపడుతున్నట్టు ముఖం పెట్టి, ''శుభమా అని పెళ్ళి సంప్రతింపులు జరుపుతూ, యీ పిశాచం ప్రసక్తి ఎందుకు తెస్తారు ? దీనికోసం చాలామంది మనుషులు, మా పిశాచాలకన్న దారుణంగా, హీనంగా ప్రవర్తిస్తున్నారు!'' అంటూ మూటను లాక్కుని, ఎగిరి చెట్టు మీదికి పోయింది.

ఆ వెంటనే సుభాషిణి అత్తగారితో; ''మీరు, ముహూర్త సమయంలో కట్నం డబ్బు యివ్వకపోతే పెళ్ళి జరగదన్నారు. ఆ డబ్బు రాస్తా పిశాచం ఎత్తుకుపోయింది. మరి ఇప్పుడు నా పరిస్థితేమిటి ఏం చేయమన్నారు ?'' అన్నది దీనంగా.

అత్తగారు సుభాషిణి రెండు చేతులూ పట్టుకుని, ''పిశాచం అన్న మాటలతో యిప్పటికే, మా తల కొట్టేసినట్టయింది. ఆ కట్నం గొడవ మర్చిపో.'' అన్నది.

సుభాషిణి మామగారు ఎంతో ఆప్యాయంగా, ''సుభాషిణీ, దిగులుపడకు. పిశాచం కట్నపిశాచాన్ని ఎత్తుకుపోయింది. అందుకు విచారపడను. నేను మూడువేల విలువచేసే నగలు, నీకు చేయించి పెడతాను. తరవాత, మీ నాన్నగారిని స్వయంగా ఆహ్వానించి, కట్నం అడగడమే కాక, దాన్ని ముహూర్తానికి ముందే యివ్వాలని వత్తిడి చేసినందుకు క్షమాపణ కోరతాను, సరా!'' అన్నాడు.

ఆ మాటలు సుభాషిణికి ఎక్కడలేని ఆనందం కలిగించినై. పిశాచం చెట్టు కొమ్మల్లో నుంచి, తన సంతోషాన్ని కనబరుస్తూ పెద్దగా చప్పట్లుచరిచింది.





# రాముడి దిగులు

పదహారేళ్ళ వయసువాడైన రాముడికి, ఎప్పుడూ దేనికో ఒకదానికి దిగులుగా వుండడం అలవాటు. ఒక రోజున వాడు దిగులుగా ఊరి బయట చెరువు గట్టున కూర్చుని వుండగా, నాలుగేళ్ళ ఈడు వాడైన జమిందారు కొడుకును, ఒక దొంగ ఎత్తుకుపోతూండడం కంటబడింది.

రాముడి ధైర్యం, దేహబలం చెప్పుకో తగ్గవి. వాడు దొంగను అటకాయించి గట్టిగా నాలుగు తన్నేసరికి, దొంగ జమీందారు కొడుకును అక్కడ వదిలేసి పారిపోయాడు.

రాముడు, ఆ కుర్రవాణ్ణి తీసుకుని జమీందారింటికి వెళ్ళి, జరిగింది ఆయనకు చెప్పాడు.

అంతవరకూ జమీందారుకు తన కొడుకును ఎవడో దొంగ ఎత్తుకు పోయిన సంగతే తెలియదు. ఆయన రాముణ్ణి మెచ్చుకుని, తన పనివాళ్ళను తిట్టి—వాడికి ఒక బంగారు కాసు బహుమానంగా యిచ్చి పంపాడు.

ఆ కాసును ఏం చేయాలో రాముడికి తెలియలేదు. వాడు బాగా ఆలోచించి, ఆ కాసును చెరువు గట్టు మీద ఒకచోట పాతిపెట్టి, గుర్తుగా దాని మీద ఒక మొక్కను నాటాడు.

కొద్ది రోజులు గడిచాక, ఆ దేశపురాజు దేశసంచారం చేస్తూ, రాముడున్న ఊరు చేరాడు. గ్రామాధికారి ఆయనకు సేవలు చేయడానికి రాముణ్ణి నియమించాడు. రాముడు చేసే సపర్యలూ, వాడి తెలివి తేటలూ, వినయమూ, బలం రాజుకు బాగా నచ్చాయి.

రాజు వాడితో, "నువ్వు, అన్నివిధాలా నాకు నచ్చావు. ఏం కావాలో కోరుకో, యిస్తాను!" అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



రాముడు "ఎందువల్లనో, నా మనసు ఎప్పుడూ దిగులుగానూ, విచారంగానూ వుంటుంది. అందరిలాగే, సంతోషంగా వుండడం, నా వల్ల కూడా అయితే బావుండును. అందుకు నేను ఏంచేయాలో చెప్పండి, ప్రభూ!" అని అడిగాడు.

"చిన్న చిన్న విషయాలకు బాధపడే వాళ్ళు, ఎప్పుడూ దిగులుగా వుంటారు. ఈ ప్రపంచంలో, ఏ పక్షిగానో, పశువుగానో కాక మనిషిగా పుట్టినందుకు ప్రతి వాడూ ఎంతో సంతోషంగా వుండాలి," అన్నాడు రాజు.

రాముడు ఒక క్షణం ఆలోచించి, "ఒక చిన్న సంగతి, ప్రభూ! మా గ్రామంలో ప్రతి ఒక్కరూ, ఎప్పుడో ఒకప్పుడు ఊరు వదిలి ఎక్కడికో వెళ్ళి వస్తూంటారు. నాకెక్కడా ఎవ్వరూ లేరు. ఎప్పుడూ, ఈ ఊరిలో వుండిపోవలసి రావడం వల్లనే, నాకు సంతోషంగా ఉండడం లేదని, నా అనుమానం," అన్నాడు.

రాజుకు వాడి మీద జాలి కలిగింది. ఆయన వాడితో, "నువ్వు దిగులుపడకు. నీకెవ్వరూ లేరనుకోకు. నేనే నీ బంధువును. ఇప్పుడు నిన్ను, నాతో రాజధానికి తీసుకువెళతాను. నీకిష్టం వచ్చినన్ని రోజులు అక్కడ వుండి, అక్కడి వింతలన్నీ చూసి వినోదించు. నీకు అక్కడే వుండిపోవాలని వుంటే, సరే! కాదనుకుంటే, నిన్ను మీ ఊరు తిప్పి పంపేస్తాను," అన్నాడు.

రాజు యిలా అనగానే రాముడికి చాలా ఉత్సాహం కలిగింది. రాజుతో రాజధానికి వెళ్ళి, కొన్నాళ్ళపాటు అక్కడి వింతలూ, వినోదాలూ చూస్తూ హాయిగా గడపాలనుకున్నాడు.

ఆ సమయంలో వాడికి తను పాతి పెట్టిన బంగారుకాసు గుర్తుకు వచ్చింది. రాజధానిలో ఖర్చుల కోసం దాన్ని కూడా తీసుకువెళదామని, వాడు చెరువుగట్టుకు వెళ్ళాడు.

అయితే, వాడు చెరువుగట్టున గుర్తుగా నాటిన మొక్కను, ఏ పశువులో తినే శాయి. అందువల్ల, తను కాసును ఎక్కడ పాతిపెట్టిందీ వాడికి తెలియలేదు. గుర్తుకు వచ్చిన ఒకచోట తవ్విచూశాడు. కాసు దొరకలేదు.

ఈ దురదృష్టానికి వాడి మనసంతా పాడైపోయింది. మళ్ళీ వాణ్ణి, ఎక్కడలేని దిగులూ పట్టుకున్నది.

అంతకు ముందు ఎంతో ఉత్సాహంగా కనిపించిన రాముడు, మళ్ళీ దిగులు పడుతూండడం గమనించిన రాజు, వాణ్ణి, దగ్గరికి పిలిచి. "ఊరొదిలి వెళ్ళడానికి, దిగులుగా వున్నదా ఏం?" అని అడిగాడు.

"లేదు, ప్రభూ! రాజధానికి నా వెంట, నేను కష్టపడి కూడబెట్టిన డబ్బు తెచ్చుకుందామనుకున్నాను. దాన్ని చెరువుగట్టు మీద పాతిపెట్టాను. కాని, యిప్పుడు ఎక్కడ పాతిందీ తెలియడం లేదు," అన్నాడు రాముడు.

"డబ్బు గురించి నువ్వేమీ బెంగ పడకు. నీకావలసినదంతా, నేనిస్తాను," అన్నాడు రాజు.

"చాలా సంతోషం. కాని, నేను కష్ట పడి సంపాయించిన డబ్బు పోవడం, ఎంతో బాధగా వున్నది," అన్నాడు రాముడు.

ఆ జవాబుకు రాజు ఆశ్చర్యపడుతూ, "ఆ పోయిన డబ్బుకోసం అంతగా దిగులు





పడుతున్నావు. ఇంతకూ ఆ చెరువుగట్టున ఎంత పాతేశావేమిటి?'' అని అడిగాడు.

ఒకే ఒక్క బంగారుకాసు, అని చెప్ప బోయి రాముడు ఆగాడు. అలా చెపితే, తాను చాలా చిన్న మొత్తానికి దిగులుపడు తున్నట్టు రాజు అనుకుంటాడు. అలా కాక, తాను చాలా పెద్ద మొత్తం పోగొట్టు కున్నట్టు రాజు నమ్మాలి!

ఇలా ఆలోచించి వాడు, రాజుతో, ''వంద బంగారు కాసులు, ప్రభూ!'' అన్నాడు.

రాజుకు వాడి మీద చాలా జాలికలిగి, ''నువ్వు విచారించకు. భూమి అడుగున ఎక్కడ బంగారం వున్నా, నాకు తెలుస్తుంది. సాయంత్రం మనం చెరువు గట్టు మీదికి వెళదాం,'' అన్నాడు.

రాజు యిలా అనేసరికి రాముడు చాలా సంతోషించాడు. ఈలోగా రాజు తన సేవకుడి కొకడికి చెప్పి, చెరువుగట్టున నూరు బంగారు కాసులు పాతించాడు.

సాయంత్రం రాముణ్ణి వెంటబెట్టుకు పోయి, బంగారు కాసులు పాతిన చోటు వాడికి చూపుతూ, ''ఇక్కడ తవ్వు!'' అన్నాడు.

రాముడు అక్కడ తవ్వేసరికి, వంద బంగారుకాసులు బయటపడినై.

''సరిగ్గా వంద వున్నాయో లేదో లెక్క పెట్టుకో!'' అన్నాడు రాజు.

వంద బంగారు కాసుల్ని చూడగానే, రాముడి ముఖంలో దిగులు మరింత ఎక్కువయింది.

రాజు ఆశ్చర్యపడి, ''అదేమిటి? నీ డబ్బు దొరికినందుకు సంతోషంగా వున్నట్టులేదే!'' అన్నాడు.

రాముడాయన కాళ్ళ మీద పడి, ''మన్నించండి! ఈ డబ్బు నాది కాదు. చాలా చిన్న మొత్తం గురించి దిగులు పడుతున్నానని, నన్ను మీరు వేళాకోళం చేస్తారని భయపడి, అబద్ధం చెప్పాను. నేను పాతిపెట్టింది, ఒకటే బంగారు

కాసు! ఈ డబ్బు యింకెవరిదో,'' అన్నాడు.

''ఎవరిదైతేనేం, నీకు దొరికింది కదా? యిక ఆ డబ్బంతా, నీదే,'' అన్నాడు రాజు నవ్వుతూ.

''ఈ డబ్బు వద్దు, ప్రభూ. ఒక్క బంగారుకాసు పోయినందుకే, నాకెంతో బాధగా వున్నది. వంద బంగారుకాసులు పోవడం అంటే, దాని యజమానికి యింకెంత బాధగా వున్నదో! ఇతరుల డబ్బు, నాకు వద్దు,'' అన్నాడు రాముడు.

రాముడి సద్బుద్ధి రాజుకు ఎంతగానో నచ్చింది. ఆయన వాణ్ణి మెచ్చుకుని, ''ఆ డబ్బు నాదే! నీ కోసం, నేనే అక్కడ పాతించాను,'' అని చెప్పాడు.

''మహాప్రసాదం, ప్రభూ!'' అంటూ రాముడాడబ్బు తీసుకున్నాడు.

''నువ్వు చాలా మంచివాడివి; నమ్మకస్థుడివి. నా కొలువులో నీకు మంచి ఉద్యోగం యిస్తాను. మళ్ళీ జీవితంలో దిగులు అన్నది, నీకు లేకుండా చేస్తాను. నువ్వెప్పుడూ సంతోషంగా వుండాలన్నది, నా కోరిక,'' అన్నాడు రాజు.

''చాలా సంతోషం, ప్రభూ!'' అన్నాడు రాముడు.

కాని, వాడి ముఖంలో ఎక్కడా సంతోష లక్షణం లేకపోగా, రాజుకు పుట్టెడు దిగులు కనిపించింది. ఆయన, వాడితో, ''నిన్నింకా దిగులు వదిలినట్టు లేదు,'' అన్నాడు.

''ఇంకెక్కడి దిగులు, ప్రభూ!'' అంటూ రాముడు మరింతగా దిగులు పడిపోతూ, ''ఈ జన్మకు, నా బంగారుకాసు దొరికే అవకాశం లేదనుకుంటాను! ఈ ఊళ్ళోనే వుంటే, ప్రతి రోజూ చెరువు గట్టు మీద దానికోసం వెతుక్కుంటూ వుండగలను,'' అన్నాడు.

రాముడి దిగులు పోగొట్టడం తనవల్ల కాదనీ, అది వాడికి పుట్టుకతో వచ్చిన బుద్ధి అనీ, రాజు గ్రహించాడు. అందువల్ల, ఆయన వాణ్ణి రాజధానికి తీసుకుపోయే ఆలోచన మానుకున్నాడు.





# ఖలీఫా-పండితుడూ

బొగ్దాదునగరాన్ని పాలించిన ఖలీఫాలలో, అల్ మమూన్ గొప్ప పండితపోషకుడుగా ఖ్యాతిగాంచాడు. ఆయన అర్హులైన పండితులను బిరుదు సత్కారాలతో ప్రోత్సహిస్తూండేవాడు.

అల్ మమూన్ వారాని కొకసారి సభ జరిపేవాడు. అందులో పండితులే కాక వివేకమూ, వాక్చాతుర్యమూ కలవాళ్ళు కూడా పాల్గొనేవాళ్ళు. ఆ సభల్లో అనేక విషయాలను గురించి చర్చలు జరుగుతూండేవి. ఆ చర్చల్లో ఉద్దండులైన పండితులకు మాత్రమే అవకాశం వుండేది. సభకు వచ్చిన సామాన్య ప్రజలకు, ఆ చర్చల ద్వారా అనేక విషయాలు తెలుసుకునే అవకాశం కలిగేది.

ఒకనాడు ఖలీఫా పండితసభ ప్రారంభిస్తుండగా, ఒక కొత్తవాడు అక్కడికి వచ్చాడు. అతడు చర్చలు వినవచ్చిన సామాన్య ప్రజల్లో కాక, సరాసరి పోయి పండితుల మధ్య కూర్చున్నాడు. చూపరులకు అతడేదో యాత్రికుడని తప్ప, పండితుడనే అభిప్రాయం మాత్రం కలగలేదు.

సభ ప్రారంభమైంది. ఒక్కొక్కరు లేచి ఆనాడు సుల్తాను పండితచర్చకు పెట్టిన విషయాన్ని గురించి మిగతావారికి అర్థమయ్యేలా మాట్లాడసాగారు. పండితుల మధ్య వున్న కారణంగా కొంతసేపటికి కొత్తగా వచ్చిన వ్యక్తి వంతు వచ్చింది. అతడు లేచి చర్చించబడుతున్న అంశాన్ని గురించి, తన అభిప్రాయాన్ని స్వచ్ఛమైన భాషలో చక్కగా విపులపరుస్తూ మాట్లాడాడు. అది విని, అందరూ ఆశ్చర్యపోయారు.

ఖలీఫా అతణ్ణి పండితులు కూర్చున్న మొదటి వరసలో కూర్చోవలసిందిగా కోరాడు. అది ముఖ్యులైన పండితులు

కూర్చునే స్థానం. కొత్త వ్యక్తి ఖలీఫా కోరిన విధంగా ముందు వరసలోకి వచ్చి కూర్చున్నాడు.

తరవాత ఖలీఫా మరొక విషయాన్ని గురించి చర్చించవలసిందిగా కోరాడు. ఆ చర్చలో కొత్తగా వచ్చిన వ్యక్తి వంతు వచ్చినప్పుడు, మొదటిసారికన్న అద్భుతంగా మాట్లాడి అందరికీ సంతోషం కలిగించాడు. పండితులతోపాటు, సభికులు కూడా హర్షధ్వానాలు చేశారు. ఈసారి ఖలీఫా అతణ్ణి తన మంత్రుల మధ్య కూర్చోవలసిందిగా ఆహ్వానించాడు.

ఆ తరవాత మరొక అంశాన్ని గురించి చర్చ మొదలైంది. ఇందులో కొత్త వ్యక్తి తన లోకానుభవం, వివేకం, వాక్చాతుర్యంతో సభను మంత్రముగ్ధుల్ని చేశాడు. ఖలీఫా అతణ్ణి తన పక్కనే వున్న ఆసనం మీద కూర్చోవలసిందిగా కోరాడు.

సభ ముగిసింది. ఖలీఫా పండితులందరికీ విందు ఏర్పాటు చేశాడు. విందు ముగియగానే ఒక్కొక్కరూ అక్కడి నుంచి వెళ్ళిపోసాగారు. కొత్త వ్యక్తి కూడా వెళ్ళబోతున్నంతలో ఖలీఫా అతడి భుజం తట్టి, "మీకు ప్రత్యేకంగా ఆతిథ్యం ఇవ్వదలిచాను. మనిద్దరం ద్రాక్ష పానీయం తాగుదాం," అన్నాడు.

ఖలీఫా ఆజ్ఞకాగానే అంతఃపుర దాసీలు రత్నాలు తాపిన రెండు బంగారు పాత్రల నిండుగా పానీయాలు తీసుకుని అక్కడికి



వచ్చారు. ఖలీఫా ఒక పాత్ర తీసుకుని, రెండవదాన్ని తీసుకోవలసిందిగా కొత్త వ్యక్తికి సైగచేశాడు.

కొత్త వ్యక్తి ఎంతో వినయంగా ఖలీఫాతో, "ప్రభూ, తమరు ముఖ్య పండితుల వరసలో నన్ను కూర్చోవలసిందిగా ఎందుకు కోరారు?" అని అడిగాడు.

"మీ వివేకం, వాక్చాతుర్యం నాకు పరమానందం కలిగించినై," అన్నాడు ఖలీఫా.

"తరవాత, తమ పక్కన వున్న ఆసనంలో కూర్చోవలసిందిగా, ఎందుకు కోరారు?" అని అడిగాడు కొత్త వ్యక్తి.

"మీ వివేకం, వాక్చాతుర్యం నాకు పరమానందం కలిగించినై," అని జవాబిచ్చాడు ఖలీఫా మరొకసారి.

"అంటే, నా వివేకం, వాక్చాతుర్యం కారణంగానే, నేను తమ దయకూ, అభిమానానికీ పాత్రుణ్ణయానన్న మాట! అయితే, మరిప్పుడు వాటిని నా నుంచి ఎందుకు దూరం చెయ్యదలిచారు?" అని అడిగాడు కొత్త వ్యక్తి.

"మీరు చెప్పేదేమిటో, నాకర్థం కాలేదు," అన్నాడు ఖలీఫా.

"ప్రభూ, తమరు నాకిప్పుడు యివ్వ చూపిన పానీయం వున్నదే, అది నాలో వున్న ఆ రెండు మంచి శక్తులనూ, సర్వ నాశనం చేస్తుంది. వాటిని ఎంతో జాగ్రత్తగా కాపాడుకోవలసిన బాధ్యత, నా కున్నది గదా! కనక, దయవుంచి ఆ పానీయం తాగకుండానే, నేనిక్కడి నుంచి వెళ్ళేందుకు అనుమతించండి," అన్నాడు కొత్త వ్యక్తి.

ఖలీఫా ఆ జవాబు విని చాలా సంతోషించాడు. ఆయన, అప్పటికప్పుడే ఆ పండితుడికి లక్ష వెండి నాణాలూ, విలువైన దుస్తులూ, ఒక జాతి గుర్రాన్నీ బహూకరించాడు.

ఆ తరవాత జరిగిన ప్రతి పండితసభలోనూ, ఈ కొత్త పండితుడికి ఖలీఫా ప్రధానస్థానం యిచ్చి ఎంతో గౌరవించాడు.





# విష్ణు కథ

కపిలవస్తు నగరాన్ని దాటి చాలాదూరం వెళ్ళాక సిద్ధార్థుడు గుర్రం దిగి కత్తినీ, ఉత్తరీయాన్నీ, ఆభరణాలనూ తీసి చెన్నుడికి యిచ్చి, "తండ్రిగారికి నా ప్రణామాలు చెప్పు! సిద్ధార్థుడు విశాల ప్రపంచంలో అడుగుపెట్టాడనీ, జీవజనుల బాధలను తొలగించే ధర్మచక్ర సంచాలక 'చక్రవర్తి'గా కపిలవస్తు నగరానికి వస్తాడనీ, కుమారుడి సిద్ధార్థ నామధేయం సార్థకంగా ఆశయసిద్ధి త్వరగా కలగాలని ఆశీర్వదించ గోరుతున్నాడనీ చెప్పు!" అన్నాడు.

చెన్నుడు నోటమాట రాక కన్నీరు కారుస్తూంటే సిద్ధార్థుడు, "చెన్నా! తల్లి లేని నన్ను పసితనం నుంచీ ఎత్తుకొని తిప్పి ఆడిస్తూ, నే నేది చెప్పినా కాదనకుండా అన్నీ చేస్తూ, తల్లి తర్వాత తల్లిలాగ వాత్సల్యంతో చూశావు. నీ రుణం ఎన్నటికీ తీరనిది! మనిషినై పుట్టినందుకు సార్థకత కోసం ఆరాటపడుతున్న నన్ను, యీ రాత్రివేళలో నగరం దాటించిన, నీ ఉపకారాన్ని మరువలేను! నా ఆశయమే ఫలించితే విశ్వశాంతికి దోహదం చేసిన మొదటివాడివి నువ్వే అవుతావు! వెళ్ళు!" అని భుజం తట్టి పంపాడు.

చెన్నుడు కదల్లేక, కదల్లేక అశ్వంతో నగరాభిముఖంగా అడుగులు వేశాడు.

సిద్ధార్థుడు ముందుకు పయనం సాగించాడు. వేగుచుక్క పొడిచింది. సూర్యోదయం అవుతున్నది.



చెన్నుడు గద్గదస్వరంతో బెక్కుతూ చెప్పినది విని శుద్ధోదన మహారాజు హతాశుడై కుప్పగా కూలి మూర్ఛిల్లాడు.

యశోధర పసిబిడ్డ రాహులుడిని అక్కున అదుముకొంటూ, "కన్నా, నువ్వయినా నాన్నగారిని అపలేకపోయావు గదా!" అంటూ కన్నీరు మున్నీరుగా ఏడ్చి ఏడ్చి, గుండె దిటవు తెచ్చుకొని పతిదేవుని ముఖంలోని మహాపురుష లక్షణాల్ని గుర్తు చేసుకొంటూ, గంభీర హృదయంతో లేచి వెళ్ళి మామగారికి పరిచర్యలు చేసి, మూర్ఛ నుండి సేదదేర్చింది.

"మహారాజా! మీ కుమారుడు సాధారణ వ్యక్తి అని తలంచక, శాక్యవంశాన్ని పునీతం చేసిన కారణజన్ముడని గుర్తించాలి! తాము కపిలవస్తు రాజ్యపౌరుల శ్రేయస్సును ఎలాగ కోరుకుంటారో అలాగే ఈ విశాల జగత్తులోని జనులందరూ ఆయన పౌరులు! వారి కోసమే సిద్ధార్థ గౌతముడిగా ఆయన పుట్టాడు, వారి కోసమే వెళ్ళారు!" అని చెప్పింది.

శుద్ధోదనుడు ఆ మాటలకు పరవశించి దుఃఖాన్ని అపుకొన్నాడు. యశోధర రాహులుడిని తాతకు అందిస్తూ, "ఇదిగో ఆయన ప్రతిబింబం!" అన్నది.

శుద్ధోదనుడు మనవణ్ణి చూస్తూ కుమారుణ్ణి తలంచుకొన్నాడు; అదే పసివయసు సిద్ధార్థుణ్ణి తనకు అప్పగించి మాయాదేవి మాయమై పోయింది.

సిద్ధార్థుడు త్వరలోనే కపిలవస్తుకు వస్తాడు—త్వరగా రావాలి! అని ఆ ఆశతోనే రాజ్యపాలన చేయసాగాడు.

యశోధర రాహులుణ్ణి ఆ తండ్రికి తగిన బిడ్డ అనిపించుకోవాలని కోరుకుంటూ పసితనం నుంచే మంచి శిక్షణతో తీర్చిదిద్దుతున్నది.

జీవ జగత్తును ఉద్ధరించగల సత్యాన్వేషణతో సిద్ధార్థుడు అనేక కష్టాల నెదుర్కొంటూ, శ్రమతమాదుల కోర్చి, అనేక ప్రాంతాలు తిరిగాడు. ఆకలిదప్పులతో శోషిల్లి ఒకచోట తెలివితప్పి పడిపోయాడు.

ఒక గోపాలకుడు అతనికి పాలుపోసి కాపాడాడు. అప్పుడే సిద్ధార్థుడికి ప్రాణ రక్షణ ఎంత గొప్పదో తెలిసింది. తోటి వారికి సేవచేయడం, సహాయపడడం మానవధర్మంగా గుర్తించాడు.

భిక్షువుగా దేశసంచారం చేస్తూ సన్యాసులను, యోగులను భిన్న భిన్న మార్గాలను అనుసరిస్తున్న వారినెందరినో కలుసుకొని ఎన్నో తెలుసుకున్నాడు. తపస్సు చేస్తే అన్నీ సిద్ధిస్తాయని వాళ్ళు నూరిపోశారు.

సిద్ధార్థుడు కఠోర తపోదీక్షలో ఉండగా నిండు చూలాలుగా ఉన్న సుజాత అనే గోపకాంత, తనకు కుమారుడు కలిగితే మళ్లీ దర్శిస్తానని మొక్కుకుంది. అలాగే ఆమె కుమారుణ్ణి కన్నది. మొక్కు చెల్లించుకోడానికి పాయసాన్నీ, పండ్లనూ పట్టుకొని పసివాడి నెత్తుకొని సుజాత బయలుదేరింది.

అప్పుడు సిద్ధార్థుడు బక్కచిక్కి బొమికలతో అతి నీరస స్థితిలో ఉన్నాడు. సుజాత యిచ్చిన పాయసాన్ని స్వీకరించి ప్రాణాన్ని నిలుపుకోగలిగాడు.

సుజాత అతనికి ప్రణమిల్లి, "స్వామీ, తమ దయవల్ల నాకు కుమారుడు కలిగాడు!" అని చెపుతూ సిద్ధార్థుడు వారిస్తూన్నా, పసివాణ్ణి అతని పాదాలకు తాకించింది.



అప్పుడు సిద్ధార్థుడు, "అమ్మా! నీవు తలంచినట్లుగా నేను మహిమాన్వితుణ్ణేమీ కాను; నీవు ఏ భావంతో నాకు ఆహారం పెట్టినా, నేను నిన్ను దయాస్వరూపిణిగా తలుస్తున్నాను. నీ వలన భూతదయను తెలుసుకున్నాను. నీవు నాకు ప్రాణభిక్ష చేసినట్లే ప్రకృతి సర్వ ప్రాణులను చల్లని దయతో సదా కాపాడుతున్నది. నీవు ఆ ప్రకృతితో సమానమైన తల్లివి!" అన్నాడు.

"స్వామీ! మీ గొప్ప మీరు చెప్పుకోడానికి యిష్టంలేక అలాగ అంటున్నారే గాని, మీరు నిజంగా మహిమాన్వితులే! నాకు తెలుసు! మాది గోపకులం. మీరు గొప్పవారు. మా ఇంటికి వచ్చి, మా



"స్వామీ! అలాగే తప్పక రావాలి!" అంటూ సుజాత పిల్లవాణ్ణి అతని పాదాలకు తాకించి, ప్రణమిల్లి సెలవు తీసుకొని వెళ్ళింది.

సిద్ధార్థుడికి తపస్సులూ, కఠోరదీక్షల పట్ల నమ్మకం పోయింది. తపస్సులు చేస్తున్న వారందరిలో స్వప్రయోజన స్వార్థమే కనిపించిందిగాని తోటి జీవకోటి పట్ల ప్రేమగాని, సహకారంగాని కనిపించ లేదు. అవి శరీరాన్ని హింసించే ఆత్మహత్యా సదృశంగా తోచాయి. అందువల్ల సిద్ధార్థ గౌతముడికి వాటితో నిమిత్తం లేక పోయింది.

ఆతిథ్యాన్ని స్వీకరించి, బిడ్డను దీవించాలని కోరాలని ఉంది కాని, నే నెంతటి దాన్ని?" అని సుజాత అన్నది.

"అమ్మా! నిజమే చెబుతున్నాను, నా తపస్సు ఫలించలేదు. నేనూ మీవంటి వాణ్ణే. మానవుల్లో తరతమ భేదాలు పెట్టుకోవడం తగనిది. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుకోవలసిన అవసరమే లేదు. జీవులలోని ప్రాణమొక్కటే అయినట్లే, మానవత్వం అంతా ఒక్కటే! నేను కృతార్థుడినై నీ కుమారుణ్ణి ఆశీర్వదించ తగ్గ అర్హత నాకు వచ్చిననాడు తప్పక, నేను మీ ఇంటికి అతిథిగా వస్తాను!" అని సిద్ధార్థుడు చెప్పాడు.

తపస్సుపట్ల అతని విముఖతను చూసి తోటి సాధకులు గౌతముడు భ్రష్టుడై పోయాడని గేలిచేశారు.

కొందరు తపశ్శాలురు, సాధకులు అద్భుత శక్తులను మహిమలను సంపాదించి, ఇంద్రజాల విద్యతో సమానంగా వాటిని ఇతరులను ఆకర్షించి తమ చుట్టూ తిప్పుకొంటూ, అదే ఘనకార్యంగా పొంగిపోతున్నారేగాని, విశ్వమానవ శ్రేయస్సుకు అవి ఎంత మాత్రమూ పనికిరాకుండా పోతున్నాయి. ప్రకృతి ధర్మాల్ని అవి ఏమాత్రం మార్చలేక పోతున్నాయి. మహామహులంతా కాలధర్మం పొందుతూనే ఉన్నారు.

అజ్ఞానంతో, మూఢ నమ్మకాలతో సత మతమౌతున్న జనులు ఎలాగ మారతారు?

యజ్ఞయాగాదుల పేరుతో మారణ హోమాలు మితిమీరిపోతున్నవి.

రాజుల్ని మభ్యపెట్టి యజ్ఞయాగాల మిషతో విపరీత మాంసభుక్కులై అగ్ర శ్రేణి వారు సమాజాన్ని మరింత కిందికి అణగదొక్కుతున్నారు.

ఇలాగ అనేక ఆలోచనలతో సిద్ధార్థుడు తర్కవితర్కాలతో నిమిత్తం లేని కర్తవ్య ధర్మం గురించి చింతిస్తూ, గయా క్షేత్రంలో ఒక పెద్ద రావిచెట్టు కింద కూర్చొని అంతర్ముఖుడై ఉండగా అతనికి జ్ఞానోదయమైంది.

ఆనాడు వైశాఖ పూర్ణిమ. చంద్రబింబం పరిపూర్ణమై ప్రకాశించినట్లే గౌతముడికి బుద్ధత్వము సిద్ధించింది; పరిపూర్ణ బుద్ధ మూర్తిగా వికాసం పొందాడు.

సిద్ధార్థ గౌతముడికి జ్ఞానోదయం అయి నప్పుడు అతను ఒక అనిర్వచనీయమైన అనుభూతిని పొందాడు. ఆ ధ్యానమగ్నా వస్థనే గౌతమబుద్ధుడు 'నిర్వాణంగా' గుర్తించాడు.

వైశాఖ పూర్ణిమ బుద్ధపూర్ణిమగా పేరొందింది. రావిచెట్టు బోధివృక్షంగా పూజింపబడింది. బుద్ధుడు బోధి సత్త్వుడుగా పేర్కొనబడ్డాడు.




ప్రాణికోటిలో బుద్ధి విశేషత చేతనే మానవుడు ఉన్నతుడు అవుతున్నాడు. బుద్ధి వికాసం చేతనే మానవుడు తన్ను తాను ఉద్ధరించుకోగలడు. తోటివారిని ఉద్ధరించగలడు.. అహింసవల్లనే మాన వుడు, మానవుడిగా బుద్ధుడు ఔతాడు. కోరికలు అరికట్టి, రాగద్వేషాలను వదిలి సుఖదుఃఖాలకు అతీతమైన నిర్వాణాన్ని అందుకుని బుద్ధత్వము పొందిన మానవుడు బుద్ధుడై, ఒక జ్యోతి అనేక జ్యోతులను వెలిగించినట్లే, అనేకులలో బుద్ధత్వము కలిగించితే, ఈ జగత్తు చీకటి నుండి వెలుగులోకి వస్తుంది. బుద్ధుడే జగత్తుకు జ్యోతి!



గౌతమబుద్ధుడు తాను తెలుసుకున్న సత్యాలను అందరికీ చెప్పసాగాడు. మొదట అతనిని గేలిచేసిన వారంతా అతని శిష్యులుగా, అనుయాయులుగా చేరారు.

బుద్ధుడు ప్రబోధించని ధర్మమనేది ఎక్కడాలేదు. ఉండదు. సామాన్య జనానికి అర్థమయ్యేలాగ అందరికీ ఆచరణసాధ్యమైన ధర్మాన్ని, ఉత్తమ జీవన సూత్రాలను ప్రచారం చేశాడు.

బుద్ధుని బోధలోని సత్యాన్ని గుర్తించి వేలాదిమంది అతని శిష్యులుగా చేరారు, అనుసరించారు. అహింసను పరమ ధర్మంగా బోధిస్తూ బుద్ధుడు దేశసంచారం చేస్తూండగా మగధ చక్రవర్తి బింబి సారుడు, బుద్ధుని ఉద్బోధతో ఉత్తేజితుడై వేలకు వేలు జీవులు బలికానున్న యజ్ఞాన్ని విరమించుకొని, తన కిరీటాన్ని బుద్ధుని పాదాల ముందుంచి తన ప్రజలందరికీ బుద్ధధర్మాలను శిరోధార్యంగా చేశాడు.

బుద్ధుని బోధలు, సిద్ధాంతాలు, సూత్రాలు మొదలైనవన్నీ బౌద్ధధర్మంగా పేరొందింది. బౌద్ధధర్మావలంబులందరూ బౌద్ధులు అని పిలువబడ్డారు.

అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న జగత్తుకు దారిచూపిన జ్యోతిగా బుద్ధుడు నిలిచాడు. అహింసా జ్యోతిగా ధర్మచక్ర సంచాలనం చేస్తూ 'చక్రవర్తి'గా పిలువ బడ్డాడు.

బుద్ధుడు దేశ దేశాలు తిరిగి బౌద్ధ సంఘాలను ఏర్పాటుచేసి, సేవాధర్మాన్ని నెలకొల్పాడు. బౌద్ధ సన్యాసులందరూ సమాజ సేవకులై జన సామాన్యానికి సంస్కారాన్ని కలిగించారు.

అతని సంచార కార్యక్రమంలో మహా రాజులు అతనికి గొడుగులు పట్టారు. చక్రవర్తులు తమ కిరీటాలను అతని పాదాల ముందుంచారు. బుద్ధుడిని చక్రవర్తు లకు చక్రవర్తిగా కీర్తిస్తూ, బుద్ధుని ఆదే శానుసారంగా ప్రజలను పాలించడంలో అహింసను, దయను అవలంబించారు. కులవివక్షతకు తావులేని బౌద్ధధర్మాన్ని

అన్ని రాజ్యాల్లోని జనబాహుళ్యం అవలం బించారు.

అప్పటికే పండితులు, పామరులు, జ్ఞానులు, రాజులు, చక్రవర్తులు బుద్ధుణ్ణి దేవుడుగా భావించారు. బుద్ధ భగవానుడు అన్నారు. కాని బుద్ధుడు ఏవిధమైన ఆరాధననూ ఒప్పుకోలేదు. భక్తి, ఆరాధన లతో ప్రమేయంలేని సత్కర్మవల్లనే మానవులు నిర్వాణాన్ని అందుకోగలరని నొక్కి నొక్కి చెప్పాడు.

ఆరు సంవత్సరాల తర్వాత బుద్ధుడు కపిలవస్తు నగరానికి బయలుదేరాడు.

బుద్ధదేవుడు వస్తున్నాడన్న వార్త కపిల వస్తు నగరానికి చేరింది. ప్రజలు ఆనందో త్సాహాలతో ఉప్పొంగిపోయారు. స్వాగత సన్నాహాలు చేశారు.

శుద్ధోదనుడు సిద్ధార్థరాకుమారుడే వస్తు న్నాడని ఆనందడోలికల్లో ఊగులాడు తున్నాడు.

"అమ్మా! నాన్నగారు వస్తున్నారట!" అంటూ రాహులుడు యశోధరతో పట్టలేని ఆనందంతో చెప్పాడు. రాహులిడికి ఆరేళ్లు నిండాయి.

"ఔను నాయనా, మీ నాయనగారు భిక్షువుగా వస్తున్నారు. ఆ చక్రవర్తికి మనం భిక్ష పెట్టాలి!" అన్నది యశోధర.

"ఏమిటీ! నాయనగారు చక్రవర్తా?" అన్నాడు కుమారుడు.

"ఔను, ఈ విశ్వానికే ఆయన చక్రవర్తి!" అన్నది తల్లి.

"మనవన్నీ ఆయనవేగా మరి!" అన్నాడు రాహులుడు.

"ఇవన్నీ మీ నాన్నగారికి అవసరం లేకనే విడిచి వెళ్ళారు. ఆయన చెప్పినట్లు నడుచుకోవడమే, ఆయనకు కావలసిన భిక్ష!" అన్నది యశోధర.

"అమ్మా! మనం అలాగే చేద్దాం! నేను నాన్నగారు ఏమి చెయ్యమంటే అదే చేస్తాను. నాన్నగారి వెనుకనే నడుస్తాను!" అని రాహులుడు నిండుగా చెబుతూంటే, యశోధర ఆనందంతో రాహులుణ్ణి గాఢంగా కౌగిలించుకొన్నది.





# కత్తి - ఒరా

గజపురి రాజు గజవర్మ ఏకైక కుమార్తె కళావతి. ఆమెకు యుక్తవయసు రాగానే, స్వయంవరం చాటించాడు గజవర్మ.

స్వయంవరానికి వివిధ రాజ్యాల రాజకుమారులు వచ్చారు. చెలికత్తెలు వెంట రాగా రాజకుమారి చేతిలో పుష్పహారంతో, స్వయంవర మంటపంలోకి అడుగు పెట్టింది.

అప్పుడు సభామంటపం ముందు, స్తంభానికి కట్టబడి వున్న ఏనుగు హఠాత్తుగా ఘీంకరిస్తూ, గొలుసులు తెంచుకుని మంటపంలోకి పరిగెత్తింది.

సభ అల్లకల్లోలమయింది. మావటివాడికి దిక్కుతోచలేదు. రాజకుమారులతో సహా అందరూ, ఎక్కడివారక్కడ హడలిపోయి, అటూ ఇటూ పరిగెత్తసాగారు.

ఆ సమయంలో అక్కడ వున్న ఒక యువకుడు సింగపు కొదమలా ముందుకు దూకి, ఏనుగు కుంభస్థలం మీద పిడికిలితో బలంగా కొట్టాడు. ఏనుగు ఆ యువకుడి ముందు మోకరిల్లింది.

ఆ యువకుడి ధైర్యానికి రాజు చాలా సంతోషించాడు. అతడు తన ప్రధాన ఆంతరంగిక సలహాదారుడైన ధీరవర్మ కొడుకు వీరసేనుడని తెలుసుకున్నాడు.

రాజకుమారి కళావతి, తన మెడలోని ముత్యాలహారం తీసి, "నీ ప్రాణానికి తెగించి మా ప్రాణాలు కాపాడావు. ఇదిగో నా బహుమానం తీసుకో," అంటూ వీరసేనుడికి ఇవ్వబోయింది. కాని, అతడు "నాకెందుకు బహుమానం? నా కర్తవ్యాన్ని నెరవేర్చడం తప్ప, నేను చేసిన ఘనకార్యం ఏమీ లేదు." అని హారాన్ని తీసుకోడానికి నిరాకరించాడు.

స్వయంవరం అర్థంతరంగా ఆగిపోయింది. ఆ రోజు సాయంకాలం, రాజ

ఆర్. వీరాస్వామి

కుమారి ఒక వెండిపళ్ళెంలో, రెండు ఖడ్గాలు పెట్టుకుని, తండ్రి దగ్గిరికి పోయి, "ఇందులో మీకు నచ్చిన ఖడ్గాన్ని తీసు కోండి," అన్నది.

ఆ రెండు ఖడ్గాల్లో, ఒకదానికి వజ్రాలు తాపిన పిడి వున్నది. దాని ఒర బంగా రంతో చేయబడి నిగనిగలాడుతున్నది. రెండవ కత్తికి మామూలు పిడి, అది ఒక చర్మపు ఒరలో వున్నది.

రాజు రెండు కత్తుల్నీ పరిశీలించి చూసి, చర్మం ఒరలో వున్న కత్తిని తీసి "ఇదే నాకు నచ్చింది!" అన్నాడు.

"బంగారు ఒరలో వున్న వజ్రాలు తాపిన పిడిగల ఖడ్గం మీకెందుకు నచ్చ లేదు, నాన్నగారూ?" అని అడిగింది కళావతి.

"వీరుడికి కావలసింది, కత్తి పదు నైనదా అన్నదే; దాని ఒర ఎటువంటిది అన్నది ముఖ్యం కాదు. చర్మం ఒరలో వున్న కత్తికే మంచి పదునుంది. అందుకే అది నాకు నచ్చింది," అన్నాడు రాజు.

కళావతి, "మనిషి అందం, ఐశ్వర్యం, అధికారం ఇవన్నీ కూడా కత్తి మీది బంగారు ఒరలాంటిదే. ఇవాళ పొద్దున జరిగిన స్వయంవరంలో అందం, ఐశ్వర్యం, రాజ్యాధికారం మొదలైనవన్నీ వున్న రాజకుమారులందరూ, హఠాత్తుగా ఆపద రాగానే హడలిపోయి పారిపోయారు. కాని, వీరసేనుడు మాత్రం తన ప్రాణాలను కూడా లెక్క చేయకుండా ముందుకు వచ్చి, మనందరినీ కాపాడాడు. యుద్ధంలో వీరుడికి కత్తిలా, జీవితంలో స్త్రీకి వీరత్వం, త్యాగం వున్న పురుషుడు భర్తగా లభించడం ఎంతో అదృష్టం. అటువంటి గొప్ప వీరుడైన వీరసేనుడు మన ఆస్థానం లోనే వున్నప్పుడు, ఇంకా స్వయం వరాలు ఎందుకు?" అన్నది చిన్నగా నవ్వుతూ.

కుమార్తె మనోభావాన్ని గ్రహించిన గజవర్మ, ఆమెను ఆనందంతో ఆశీర్వ దించి, ఆమెకూ వీరసేనుడికీ వైభవంగా వివాహం జరిపించాడు.





# కొరగాని న్యాయపీఠం

కుందన పురాన్ని ఏలే చందనరాజుకు న్యాయం నూటికి నూరుపాళ్ళూ అమలు జరగాలన్న ఉద్దేశం ఉండేది. సాధారణంగా అది సాధ్యపడదు. ఎందుచేతనంటే, న్యాయనిర్ణయం చెయ్యవలసిన వాళ్ళు మానవమాత్రులు, వాళ్ళు పొరపడే అవకాశాలు ఎన్నయినా ఉంటాయి. అందువల్ల ఎప్పుడో ఒకసారి న్యాయలోపం జరగక తప్పదు.

ఈ లోపం జరగకుండా ఉండటానికిగాను చందనరాజు అరణ్యానికి పోయి ధర్మదేవతను గురించి తపస్సు చేశాడు.

ధర్మదేవత ఆ తపస్సుకు మెచ్చి, రాజును ఏం కావాలో కోరుకోమన్నది. తన కొక న్యాయపీఠాన్ని అనుగ్రహించమనీ, దాని మీద నిలబడి ఎవరైనా అబద్ధం ఆడితే వారికి ఘోరమైన వికారాకారం రావాలనీ రాజు కోరాడు.

ధర్మదేవత రాజుకు అలాటి న్యాయపీఠాన్ని ఇచ్చి అంతర్థానమయింది. రాజు దాన్ని మేళతాళాలతో తెచ్చి తన సభలో ఏర్పాటుచేసి, దాని మహిమ అందరికీ వెల్లడించాడు.

అప్పటికీ న్యాయపీఠం యొక్క మహిమలో నమ్మకం లేనివాళ్ళు దాని పైన నిలబడి అబద్ధాలు చెప్పి, వికారాకారాలు పొందాక అందరికీ దానిలో మంచి గురి కుదిరింది.

రాజు న్యాయాన్ని నాలుగు పాదాల మీద నిలబెట్టగలిగా ననిపించుకున్నాడు. రాజుకు ఎక్కడలేని తృప్తి ఆనందం కలిగాయి.

"నేనిప్పుడు కళ్ళు మూసుకుని నిశ్చింతగా న్యాయనిర్ణయం చెయ్యగలను. నా న్యాయపీఠం ఉండగా నా పరిపాలనలో అన్యాయం జరగటానికి వీల్లేదు," అని




రాజు మంత్రి సామంతులున్న సభలో ఒకసారి ప్రగల్భాలు పలికాడు.

ఆ మాటలు విని, మంత్రి పెద్దగా నవ్వి, "మహారాజా, న్యాయపీఠాన్ని అలా గుడ్డిగా నమ్మటం అంత మంచిది కాదు. దీన్ని వంచించి ఎవరైనా అన్యాయం చెయ్యవచ్చు," అన్నాడు.

రాజుకు ఆగ్రహం వచ్చింది. "న్యాయపీఠాన్ని అలా అనటం కంటె అత్యాచారం ఉండదు దాన్ని వంచించి అన్యాయం చెయ్యవచ్చునని మూడు రోజులలోగా అందరి ఎదటా రుజువు చెయ్యలేకపోతే నీ తల తీయించేస్తాను," అని ఆయన మంత్రితో అన్నాడు.

కుందనపురంలో హేమకురంగి అనే అందమైన యువతి ఉండేది. ఆమెకు తల్లీ దండ్రీ లేరు. ధనవంతురాలు. తన వంటి సౌందర్యవతి ప్రపంచంలో లేదన్న గర్వంతో అందరినీ అవమానిస్తూ ఉండేది. రాజుకూ ఆమెకూ కూడా గుణపాఠం నేర్పాలని మంత్రి సంకల్పించాడు.

ఆయన ఒక యోగి లాగా వేషం వేసుకుని హేమకురంగి ఇంటి కెదురుగా తిష్ఠ వేసి, దారే పొయ్యేవాళ్ళ దగ్గిర డబ్బూ, బంగారమూ తీసుకుని, వాళ్ళిచ్చిన దానికి రెట్టింపు ఇచ్చి పంపనారంభించాడు. యోగి చేస్తున్న పని చూసిన మీదట హేమకురంగికి లోభం పుట్టుకొచ్చి, రాత్రివేళ ఎవరూ చూడకుండా ఆయనవద్దకు వచ్చి, తనవద్ద ఉన్న బంగారమూ, రత్నాలూ తెచ్చి ఇచ్చి, దాన్ని రెట్టింపు చేసి ఇవ్వమని వేడుకున్నది.

రేపుదయం ఇస్తానని యోగి ఆమెను పంపేసి, ఆమె ఇచ్చిన బంగారాన్నీ, రత్నాలనూ తన దండంలో ఉండే డొలుపులో దాచిపెట్టేశాడు.

యోగి రాత్రికి రాత్రే ఎక్కడైనా పారిపోకుండా చూస్తూ ఉండటానికి తన నౌకర్లను నియోగించి, హేమకురంగి మర్నాడు ఉదయమే వచ్చి తన సొత్తు రెట్టింపు చేసి ఇవ్వమన్నది.

"నీ సొత్తేమీ నా దగ్గర లేదే!" అన్నాడు యోగి ఆశ్చర్యం నటిస్తూ.

హేమకురంగికి కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి యోగి కదా అని తన కున్నదంతా ఇచ్చేస్తే అంతా కాజెయ్యాలని చూస్తున్నాడు! రాజుగారితో ఫిర్యాదు చెయ్యటానికి ఆమె యోగిని రాజుగారి దగ్గిరికి రమ్మన్నది.

యోగి అందుకెలాంటి అభ్యంతరమూ చెప్పక, ఆమెతో రాజు దగ్గిరకు బయలు దేరాడు.

హేమకురంగి చేసిన ఫిర్యాదు విని రాజు యోగిని న్యాయపీఠం మీద నిలబడి జవాబు చెప్పమన్నాడు. యోగి తన దండాన్ని పట్టుకోమని హేమకురంగి కిచ్చి, న్యాయపీఠం ఎక్కి, "ఈ హేమకు రంగి సొత్తు నావద్ద చిల్లిగవ్వ కూడా లేదు," అని చెప్పి, చెక్కుచెదరకుండా న్యాయపీఠం నుంచి దిగి వచ్చాడు.

ఇంత దారుణమైన అబద్ధాన్ని విని హేమకురంగి ఆగ్రహావేశంలో ఆదండాన్ని తన చేతిలో పట్టుకునే న్యాయపీఠం ఎక్కి, "నా బంగారమూ, రత్నాలూ ఈ యోగి కిచ్చాను. దాన్ని నాకీ దొంగవాడు తిరిగి ఇవ్వనే లేదు," అని గట్టిగా అరిచింది.

ఆమె మాట పూర్తి కాకుండానే ఆమె రూపం వికారంగా మారిపోయింది. సభలో వున్నవాళ్ళందరూ విరగబడి నవ్వారు.

మంత్రి తన వేషాన్ని విప్పేసి, రాజుకు జరిగినదంతా చెప్పి, "చూశారు గదా, మీ న్యాయపీఠం ఈ హేమకురంగికి చేసిన అన్యాయం?" అన్నాడు.

హేమకురంగి బుద్ధిపూర్వకంగా అబద్ధం ఆడలేదు; తన చేతిలో వున్న దండంలో తన సొత్తు ఉన్నదన్న మాట ఆమెకు ఏమాత్రమూ తెలియదు. అయినా ఆమె కురూపి అయిపోయింది.

ఈ సంఘటనతో రాజుకు న్యాయపీఠం మీద విరక్తి పుట్టి, దాన్ని న్యాయస్థానంలో నుంచి తీయించేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.



P. R. Herle



S. B. Prasad

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పువ్వు కావాలా, తమ్ముడూ?   రెండవ ఫోటో: వేషమెలా ఉంది, అమ్మడూ!

పంపినవారు: ఎమ్. రజనీకాంత్, పాకాల (చిత్తూరుజిల్లా)

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు

1. రామేశ్వర దేవాలయం. 2. తంజావూరులోని బృహదీశ్వరాలయంలో. 3. ఒరిస్సాలోని కోణార్క దేవాలయం. ఆ ఆలయ నిర్మాణాన్ని పూర్తిచేసిన వెంటనే ధర్మపాదుడనే బాలుడు సముద్రంలో పడి ప్రాణాలు వదిలాడు. 4. కొచ్చిన్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# రీటా శిరోజ సంరక్షణకు



జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.

## రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును




స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వీ. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి. (వి. పి. పి. చార్జీలు అదనం)






























NO562
Rs 100-50


















































































# MERI GOLD COVERING WORKS

**P.O. BOX 1405, 14, RANGANATHAN STREET**
**T. NAGAR MADRAS-600 017 INDIA**



"అబ్బాయిది పదకొండేళ్ళ
ప్రాయం. నేడిక. ఫుట్‌బాల్
ఆటలో ప్రపంచంలో
సాటిలేని మేటి ఫార్వర్డ్
ఆడగాడవుతాడట."

# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

పెరిగే వయస్సులోని పిల్లలు మరే హెల్త్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఘుమ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో. ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

1 కి.గ్రా. ప్యాక్‌లో
కూడా దొరుకుతుంది.
దీని లోపల ఉంది ఉచితంగా
లభించే మగ్.

**క్యాడ్‌బరీస్**
# బోర్న్‌విటా

పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వడం.



**మీకు కావలసిన సామాను:**
- కార్డ్ బోర్డు
- కార్డ్-పేపర్
- వెల్వెట్ కాగితం (పసుపు పచ్చ, జేగురు రంగు, వంగరంగు)
- ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్




1. 18" x 11" కార్డ్‌బోర్డ్ షీట్‌ని తీసుకోండి. చూపించినట్లుగా, పెట్టె యొక్క రేఖాచిత్రాన్ని గీసి, మరి ఆ గీత చుట్టూరా కత్తిరించండి. ఆ కార్డ్‌బోర్డ్‌ని ఎలా మడవాలో అనేది చుక్కలు పెట్టిన గీతలు చూపిస్తాయి.



2. కార్డ్‌బోర్డ్‌ని ఆ చుక్కలు పెట్టిన గీతం ప్రకారం మడిచి దానిని ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్‌తో అంటించండి. పెట్టె తయారయ్యేలాగ, అంటించి, పెట్టె అడుగుభాగాన్ని మూసివెయ్యండి.



3. పెట్టెను జేగురు రంగు వెల్వెట్ కాగితంతో అంతా పెట్టె పైనా, క్రిందా కప్పివెయ్యండి.



4. చూపించినట్టుగా, కార్డ్-పేపర్‌ని సరియైన ఆకారంలో కత్తిరించి, జేగురు రంగు వెల్వెట్ కాగితాన్ని, వెనక్కి వెనకగా అంటించండి— అదే అలీ యొక్క శరీరం.



5. చూపించిన పద్ధతిలో, చెవుల్ని, ముక్కునూ, కళ్ళనూ అంటించండి—వాటికి వంగరంగూ, పసుపుపచ్చ రంగుల్లోని వెల్వెట్ కాగితాన్ని వాడండి.



6. అలీ యొక్క శరీరాన్ని పసుపుపచ్చ, వంగరంగు వెల్వెట్ కాగితాలతో అలంకరించండి.



7. కార్డ్-పేపర్ నుంచి కళ్ళ ఆకారాన్ని కత్తిరించి, దానిపైన పసుపుపచ్చ వెల్వెట్ కాగితం కప్పండి. చూపించినట్టుగా, అలీ యొక్క శరీరాన్ని పెట్టె యొక్క ముందు భాగానికి, కళ్ళని క్రింది భాగానికి అంటించండి.

బలే బలే ! అలీ బౌల్ తయారైంది. మీరు మిగిల్చిన డబ్బునంతటినీ దాస్తుంది అది, ఎంతో జాగ్రత్తగా.




# ఫెవికాల్ ఎమ్ ఆర్

సింథెటిక్ ఎడ్హెసివ్

## బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది

**Results of Chandamama Camlin Colouring Contest No.36 (Telugu)**

*1st Prize:* Veldandi Venamadhaw, Krimnagar. *2nd Prize:* S.E.Prasad, Coimbatore-641 004. Bandi Markandeyulu, Pedana. T.S.V.Ramesh, Hyderabad-500 001. *3rd Prize:* J.Saikumar, Waltair. M.Dhora Babu, Bangalore-560 010. S.Vinay Babu, Hyderabad-500 659. S.Peddintamma, Anakappale. M.S.Jakirulla, Indukurpet. P.Balu, Rajahmundry. B.Nagendrudu, Panyam. V.V.Sunderkumar, Indukurpet. A.Srinivasa Rao, Ongole. K.Sivasai Krishna, Kakinada.